బొమ్మల

రాజా

# రాంమోహన్ రాయ్

(1772 - 1833)

మలయశ్రీ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ * విజయవాడ-520002

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవితచరిత్ర
" అక్బర్ బీర్బల్ వినోదకథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్యకథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహసకథలు 2భాగాలు
" భేతాళకథలు
" మొగల్ సామ్రాజ్య కథాగాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తుకథలు
" మదర్ థెరిస్సా
" రవీంద్రనాథఠాగూర్
" యోగి వేమన
" భగత్ సింగ్
" అంబేద్కర్
" యశపాల్ కపూర్
" భగవతీచరణ
" సుభాస్‌చంద్రబోస్
" చంద్రశేఖరఆజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజా రామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

బొమ్మల పంచతంత్రం (2 భాగాలు)

" రామాయణం

" భారతం

" భాగవతం

" దశావతారాలు

" శ్రీకృష్ణలీలలు

" పరమానందయ్యశిష్యులు

" శ్రీ వెంకటేశ్వరలీలలు

" శ్రీ అయ్యప్పలీలలు

" శ్రీరామపట్టాభిషేకం

" జై వీర హనుమాన్

" పల్నాటివీరచరిత్ర

" బాలనాగమ్మ

" శ్రీ కాళహస్తిమహాత్మ్యం

" శ్రీశైలక్షేత్ర మహాత్మ్యం

" శ్రీ సింహాచలక్షేత్రము

" శ్రీ యాదగిరి నరసింహస్వామి చరిత్ర

" శ్రీ కాశీ రామేశ్వర మజిలీలకథలు

" కోటప్పకొండ చరిత్ర

" శ్రీ వినాయక విజయము

" శ్రీ భద్రాచల మహాత్మ్యం

" శ్రీ పాండురంగలీలలు

" శ్రీ రాఘవేంద్రలీలలు

" కనకదుర్గ మహాత్మ్యం

" శివలీలలు

మహామనిషి

# రాజా రాంమోహన్ రాయ్

## జననం

బెంగాల్‌లోని రాధానగర్ అనే చిన్న గ్రామంలో పూల్‌ఠాకూరాణి రమాకాంత్‌రాయ్ అనే బ్రాహ్మణ దంపతులకు రాంమోహన్‌రాయ్ 1772 మే 22 తేదీన జన్మించాడు. ఆ గ్రామం మొదట హూగ్లీ జిల్లాలోనిదైనా తర్వాత అదే జిల్లాలోని అరంబాగ్ ప్రాంతంలో చేరిపోయింది. ఖనకుల్ అనే ప్రఖ్యాత గ్రామం సమీపాన వుంది రాధానగర్.

పూల్‌ఠాకూరాణి సుగుణవతి. తెలివిగల గృహిణి. రాయ్ తండ్రి తాతలు ముర్షిదాబాద్ ముస్లిం పాలకులవద్ద ఉద్యోగాలు చేశారు.

## విద్యాభ్యాసం

రామ్మోహన్‌రాయ్ ప్రాథమిక విద్య రాధానగర్ గ్రామ ప్రాథమిక

పాఠశాలలో జరిగింది. అక్కడే ఒక పార్శీ మౌల్వీసాహెబువద్ద పారసీ భాషను కూడా నేర్చుకున్నాడు.



ఆ తర్వాత ఉన్నత విద్యకోసం కొడుకును పాట్నా పంపించాడు రమాకాంతరాయ్. ఆ రోజుల్లో ఇస్లాం విద్యాబోధనకు పాట్నా నగరం కేంద్రం. తండ్రి ముస్లిం ప్రభువులదగ్గర వుద్యోగి కాబట్టి కొడుకునకు సైతం ఆ రాజుల ప్రాపకం లభించే రీతిలో ఇస్లాంవిద్య నేర్పించనెంచాడు. దానితో రామ్మోహన్‌రాయ్ అరబ్బీ, పార్శీ నేర్చుకొన్నాడు. ఖురాన్ చదివాడు.

అరబ్బీ అనువాదంలో లభించిన యూక్లిడ్, అరిస్టాటిల్, మొ॥ యూరోపు తత్త్వవేత్తల రచనలు చదివాడు. అందువల్ల ఆయనలో తార్కిక శక్తి పెంపొందింది.

# దేశ కాల పరిస్థితులు

నిజానికి అది భారతదేశ చరిత్రలో అంధకారయుగం. హిందూ రాజుల పరిపాలన ఒకరీతిగా అంతరించింది. ముస్లిం పాదుషాల పరిపాలనకూడా ముక్కలు చెక్కలవుతున్నది.

ఆంగ్లేయ సామ్రాజ్యం స్థిరపడుతున్నది.

కాలదోషం పట్టిన సంప్రదాయాలు, సంకెళ్ళగామారి బాధపెట్టే ఆచారాలు, స్వమత దురభిమానాలు దేశాన్ని కల్లోల పరుస్తున్నవి. జన చైతన్యం చేవ చచ్చిపడివుంది. ఇది రామ్మోహన్‌రాయ్ జన్మకాల దేశపరిస్థితి. తన పర అనే భేద భావాలకు చోటీయకుండా సత్య సంశోధనకు పూనుకున్న మహనీయుడాయన.

వివిధ మతాలవారు జీవిస్తున్న ఈ విశాలదేశంలో మత సామరస్యాన్ని సాధించాలంటే అన్నిపక్షాల సిద్ధాంత రాద్ధాంతాలను క్షుణ్ణంగా అధ్యయనంచేసి మంచి ఎందులోవున్నా స్వీకరించాలి-చెడును త్రోసిపుచ్చాలి. అవసరమైతే నూతన సిద్ధాంతాలను రూపొందించి ప్రచారం చేయాలి అనుకున్నాడు. ఆయన అదే పని చేశాడు.

ముస్లిం మతవ్యాప్తితో హిందూమతానికి క్రొత్త సవాళ్ళు ఎదురైనాయి. హిందూవైదిక మతాన్ని అంతకు వెయ్యేండ్లకు ముందే జైన బౌద్ధాలు ఎదిరించాయి. విగ్రహారాధనలులేని వివిధ ప్రకృతి దేవతలను ఆరాధించేది వేదమతం. ఆ తర్వాత

పురాణాల ప్రభావంతో వివిధ దేవతల విగ్రహాలు రూపొంది శైవ వైష్ణవాలుగా మారింది. వర్ణవ్యవస్థకంటె వేరుగా కుల వ్యవస్థ బిగ్ర బిగుసుకొంది. పురోహితుల గురువులు రాజులకంటె మిన్నగా జనాన్ని శాసించి-బాధించసాగారు. వారి ధర్మ నిబంధనల్లో స్వార్థ ప్రయోజనం చోటు చేసుకుంది. పురోహితులకు అదొక జీవన విధానం-ఆదాయ మార్గమైంది. ప్రజలకు బ్రతుకు భారమైంది.

జైన బౌద్ధాల ప్రభ తగ్గినా, ఇస్లాం రాకతో హిందువులను ఇదేమని అడిగేవారు ఎదురయ్యారు. వారికత్తిధాటిని వీరి మంత్రబలం అడ్డుకోలేకపోయింది. వారి శూన్యదేవుని మందిరాలు నూతనంగా నిర్మింపబడి వైభవోపేతాలైన వీరి దేవాలయాల దేవతామూర్తుల శక్తికి ప్రశ్నగా మిగిలాయి. మహర్షుల సన్యాసుల మహిమలు వట్టిపోయాయి.

అదే సమయంలో హిందూ ముస్లిం మతాల సమైక్య రూపంగా కబీరు దాసు గురునానకు మొ॥వారు నూతనంగా భక్తిమార్గాన్ని ప్రచారం చేశారు.

ఆంగ్లేయుల రాకతో క్రైస్తవం వ్యాపించి హిందువులకే కాక ముస్లింలకూ పోటీగా నిలిచింది. అలాంటి పరిస్థితిలో జన్మించి జీవించినవాడు మన చరిత్ర పురుషుడు.

## పదహారేళ్ళ వయసులో పరిశోధన

పాట్నానుంచి రాధానగర్ చేరుకొని ఒక పరిశోధనాత్మక గ్రంథం వ్రాయడానికి పూనుకున్నాడు. హిందూమతంలోని విగ్రహాల పూజలను, ఇతర

మూఢాచారాలను పరిశీలించడం అందులోని ప్రధానాంశం. అందులో విమర్శన పాలు ఎక్కువ.

అంతకు క్రితం తాను చదివిన ఇస్లామీ సిద్ధాంతాలకుకూడా ఇది భిన్నం. అప్పటికే అతనికి ముస్లిం సూఫీభక్తి తత్త్వం తెలుసు. పైగా ఎనిమిదవ శతాబ్దిలో బస్రాలో హేతువాద ఉద్యమం సాగించిన వాసిల్-బి-అటా, అమిర్-బి-ఉబైద్ ముతజిలా, సిద్ధాంతాలు ఒంటపట్టాయి.



రాయ్ ఈ రచన విషయం తండ్రికి తెల్పింది. ఆయన పుత్రునిపై కోపించి అలాంటి పిచ్చిరాతలు మానుకొమ్మని హెచ్చరించాడు. సత్యాన్వేషణ కోరిక బలీయంగావున్న రామ్మోహన్ తండ్రిమాట పెడచెవిన బెట్టాడు. ఇదేమిటన్న బంధువులతో వాదనకు దిగాడు. కొడుకు ధోరణి విపరీతంగా తోచింది రమాకాంత్‌కు. దాంతో ఆయన పుత్రప్రేమను దిగమ్రింగుకొని రాయ్‌ను ఇంటి నుంచి వెళ్ళిపొమ్మన్నాడు.

శ్రీరామచంద్రునిలా తండ్రిమాటను అక్షరాలా పాటించాడు మన కథానాయకుడు. ఇల్లువిడిచి గమ్యంలేకుండా ఎన్నో ప్రాంతాల్లో తిరిగాడు.

## టిబెట్‌లో

అదే ప్రయాణంలో టిబెట్ చేరాడు. అక్కడ బౌద్ధమతం వ్యాప్తిలో వుంది. అయినా వారు బుద్ధ విగ్రహాలను ఆరాధించేవారు.

ప్రపంచ మతాలన్నీ హిందూ క్రైస్తవ ఇస్లామీలు... దైవం విశ్వాసంపై ఆధారపడి రూపొందినవే. ఒక్క జైన బౌద్ధాలు మాత్రం దేవుని నమ్మవు. శీలానికి విలువనిస్తాయి. అహింసకు పట్టం కట్టాయి.

గౌతమ బుద్ధుడు లౌకికమైన సత్ప్రవర్తనకు విలువిచ్చినాడే తప్ప ఏనాడూ భగవానుని ఊసు ఎత్తుకోలేదు. తన సిద్ధాంతాలను ఆచరించమన్నాడే తప్ప తనను పూజించమనలేదు. ఆంధ్ర నాగార్జునుని మహాయాన బౌద్ధశాఖ బుద్ధపూజకు నాంది పలికింది. అదే విదేశాలకు వ్యాపించింది, అసలు సిసలైన బుద్ధబోధ హీనయాన మత సిద్ధాంతంగా కాంతిహీనమైంది.



రాంమోహన్‌రాయ్‌కు టిబెట్ బౌద్ధ పూజలు వింతగా తప్పుగా తోచాయి. అక్కడ ఆచరణలకంటె ఆచారాలు ఆరాధనలు ఎక్కువగా కన్పించాయి. ఇదేమిటని ప్రశ్నించి, అక్కడి లామాల కోపానికి పాత్రుడయ్యాడు. సత్యసంధులకంటె, సత్త్వ సంపన్నులకంటె, తప్పు నడకలవారికి, చేతకాని వారికి కోపమెక్కువ. ఎక్కడికి వెళ్ళినా ఏ సత్యమూ తెలియక మనశ్శాంతి లభించక తిరిగి భారతదేశానికే చేరుకున్నాడు.

## కాశీలో

హిందూ పండితులకు పట్టుకొమ్మ అయిన కాశీలో కొన్నేండ్లు గడిపాడు. అనేక పండితులను సేవించి వారి సన్నిధిలో సంస్కృత భాషను హిందూ వేదాంతాన్ని అధ్యయనం చేశాడు. మత సిద్ధాంతాల లోతుపాతులు మరింత చక్కగా అర్థం కాగలిగాయి.



అయినా చిత్తశాంతి మాత్రం లభించలేదు. 1803 లో రమాకాంతరాయ్ మరణించాడు. అదీ రామ్మోహన్‌పై పెద్ద ప్రభావాన్ని చూపించలేదు. సొంత గ్రామంలో వుండాలనిపించలేదు.

కాశీనుంచి ముర్షిదాబాద్ వెళ్ళాడు. అది తన పూర్వీకులు వుద్యోగాలు చేసిన ప్రాంతం.

# ముర్షిదాబాద్‌లో మొదటి గ్రంథ రచన

"ఏ కేశ్వరో పాసకులకు ఒక కానుక" అనే గ్రంథం పారశీభాషలో రాయ్ అక్కడ రచించారు. దానికి అరబ్బీలో పీఠిక వ్రాస్తూ ఆయన ఇలా చెప్పాడు.

"నేను ప్రపంచంలోని యెన్నో మారుమూల ప్రాంతాల్లో పర్వత ప్రదేశాల్లో తిరిగాను. సృష్టికి కారణం ఏదో ఒక పరమశక్తి వుందనే అందరూ నమ్ముతున్నారు. ఆ మూలతత్త్వానికి విచిత్రమయిన లక్షణాలను అన్వయింప జేస్తున్నారు. అందులోనూ ఏకాభిప్రాయంలేదు. నిషిద్ధమైనవీ (హరాం) న్యాయ సమ్మతమైనవీ (హలాల్) అయిన మత సూత్రాలకు సంబంధించిన వివిధ కార్యకలాపాలను అనుసరించడంలోనూ వారిలో ఏకాభిప్రాయంలేదు. ఈ అనుమానంతో నేనొక నిర్ణయానికి వచ్చాను. దైవాన్నిగూర్చి అన్వేషించడం మానవ సహజ లక్షణం. మానవజాతిలోని వేర్వేరు తెగలవారు ఒక ప్రత్యేక దైవాన్నో, దేవతలనో పూజించడానికీ, ఆ దేవతలకు కొన్ని ప్రత్యేక శక్తులున్నట్లు భావించడానికీ, విచిత్రమయిన ఆరాధనలను అనుసరించడానికీ, మానవ జాతిలో పెంపొందిన ఒక విధమయిన విపరీత ధోరణే కారణం. ఈ ధోరణి కలగడానికి జాతుల అలవాట్లు, అభ్యాసాలూ కారణాలు."

సత్యాన్వేషి స్వమత పక్షపాతానికి లోనుకాక ప్రతి మతాన్నీ న్యాయ దృష్టితో చూడాలని వ్రాస్తూ మూఢాచారాలను, అంధవిశ్వాసాలను గూర్చి ఇలా వివరించాడు.

# రామ్మోహన్ హేతువాది

"అలవాట్లు, ఆచారాలు తమపై చూపించే ప్రభావంవల్ల జనం కార్య కారణ సంబంధాలను సరిగా ఆలోచించకుండా గ్రుడ్డిగా నదుల్లో స్నానాలు చేయడం, చెట్లకు మ్రొక్కడం, సన్యసించడం, తమ చేసినపాపాలకు మతగురువుల



ద్వారా పరిహారం కనుక్కోవడంవల్ల పవిత్రత లభిస్తుందని నమ్ముతారు. తాము నమ్ముకొన్న వస్తువుల ప్రభావంవల్ల, తమ గురువుల మహిమవల్ల పవిత్రుల

మవుతున్నట్లుగా భావిస్తారు. నిజానికి ఆ భావాలు తమ ఇష్టానిష్టాలకు తగినట్లు వుంటాయని వారికి తెలియదు. ఆ ఊహా వస్తువుకు అసలు ప్రభావమంటూ ఏదైనా వుంటే, అది ఒక ప్రత్యేకదేశం యొక్క నమ్మకానికీ, అలవాట్లకూ పరిమితం కాకుండా వుండాలి. వివిధ మతాలను అనుసరిస్తున్న వివిధ దేశాలకు, వ్యక్తులకు సమానంగా వుండి వుండాలి. కాని వాటి ప్రభావం వివిధ వ్యక్తులకు అర్హతలబట్టి వేరవుతున్నవి. కాని నిజానికి అది దాన్ని నమ్మే వ్యక్తియొక్క ఇష్టాన్నిబట్టి వుండదు. ఎవడయినా విషాన్ని మిఠాయి అని తిన్నా అది (దాని ప్రభావాన్ని చూపుతుంది) దాన్ని తిన్నవ్యక్తిని చంపుతుంది."

గ్రుడ్డినమ్మకాలను, కార్యకారణ సంబంధంలేకపోవడాన్ని, మూఢ లక్షణాలుగా పేర్కొన్నాడు. గ్రుడ్డి నమ్మకాలంటే గొర్రెదాటు వ్యవహారం. ఎవరేదయినా చెప్పితే అది నిజమా, అబద్ధమా అలాంటి విషయం జరగడానికి వీలుందా లేదా, అని ఆలోచన లేకుండా నమ్మేయడం. ఇక కార్యకారణ సంబంధం వివరణ తెల్సుకుందాం. కార్య మనగా పని. ఒక కార్యంచూసి అది అలా జరగడానికి కారణం ఏమైవుంటుందా? అని ఆలోచించి తెల్సుకోవడమే కార్యకారణ సంబంధం. ఉదాహరణకు-అయస్కాంతం ఇనుప ముక్కల్ని ఆకర్షించుకుంటుంది. విజ్ఞాని అది వస్తుగుణమని గ్రహిస్తాడు. దానినే అజ్ఞాని మాయగా భ్రమిస్తాడు. అలాగే సున్నం పసుపుతో కలిపితే ఎర్రని చందిరం తయారౌతుంది. సున్నంలో నవాసారం కలిపితే అమోనియా లిక్కర్ అనే ఘాటైన (సర్దిమందు గొట్టాల్లోనిది) వాసన వస్తుంది. తెలియనివారికివి మాయలు. తెలిసినవారికి రసాయనిక చర్యలు.

# అద్భుతాలు - అబద్ధాలు

మూఢ విశ్వాసాలు వుండడానికి కారణం అజ్ఞానం అన్నాడు రాయ్. అజ్ఞానానికి కారణం అవిద్య.

చదవని వాడజ్ఞుండగు, చదివిన సదసద్వివేక చతురత కలుగున్-అని భాగవతంలో వుంది.

వింతల్లో వింతేమిటంటే చదువుకున్నవాళ్ళలో సైతం అనేకమయిన మూఢ విశ్వాసాలుండటం! అతీంద్రియ శక్తులు, అద్భుతాలు అబద్ధాలని భావించాడు రామ్మోహన్. ఈ యోగులు స్వాములు చూపే మహిమలన్నీ అబద్ధాలని రాయ్ విశ్వాసం. అవి గారడీ గమ్మత్తులని వివేకం కలవారికి ఇట్టే తెల్సిపోతాయని ఇలా వివరించాడు.

"మామూలు మనుషులు భ్రమలకు లోనై తమ తెలివికి అంతుపట్టని సంఘటనలను లేదా పనులను చూసినప్పుడు, అవి అలా జరగడానికి మూల కారణాలను గ్రహించలేనప్పుడు వారు వాటిని అతీంద్రియ శక్తులు లేదా అద్భుతాలు అని అనుకొంటారు. ప్రపంచంలోని పదార్థాలన్నీ కార్యకారణ సంబంధంతో ముడిపడి వుంటాయనే రహస్యం వారికి తెలియదు. ఏ పదార్థం ఉనికయినా ఒక నిర్ణీత కారణంమీదా, పరిస్థితిమీదా ఆధారపడి వుంటుంది. అలా కనిపించని కారణాలగూర్చి ఆలోచిస్తే. ఈ ప్రకృతిలోని పదార్థం విశ్వమంతటితో సంబంధించివుందని మనకు తెలిసిపోతుంది. అనుభవంలేక పైగా భ్రమలకు లోనైనందువల్లనూ కొందరికి

కొన్ని పదార్థాల లేదా కార్యాల కారణాల గురించి తెలియకపోవచ్చును. దాన్ని అవకాశంగా తీసుకొని మరొకరు దాన్ని అతీత శక్తి చర్యగా వివరించి ప్రజలను ఆకర్షించుతారు" ఇంకా ఈ విషయంలో ఇలా అన్నాడు.

"తెలివిగలవారికి అటువంటి అతీంద్రియ శక్తుల క్రియలనుంచి తమను రక్షించుకోవడానికి తర్కబుద్ధి, విచక్షణ జ్ఞానం రక్షణగా వుపయోగపడతాయి కొన్ని సందర్భాలలో యెంత చక్కగా లోతుగా పరిశీలించినప్పటికీ ఈ అద్భుతాలకు కారణాలు బోధపడకపోవచ్చునుకూడా. అయితే అటువంటి సందర్భాలలో మనం మన జ్ఞానాన్ని ఆశ్రయించాలి. ఆ కారణాలను అర్థంచేసుకోకపోవడం మన అశక్తి వల్లనే అని ప్రశ్నించుకోవాలి. ఆ కార్యాలను ప్రకృతి సూత్రాలకు, నియమాలకు భిన్నంగా అసంభవాలయిన ఏ మహిమలకో అంకెవేయడం తగిన పనేనా? అని మన జ్ఞానాన్ని ప్రశ్నించుకోవాలి" అప్పుడు సరియైన జవాబు లభిస్తుంది.

ఉదాహరణకి-గ్రహబాధలు తొలగాలని దిగదుడుపులు (మంత్రాలు), ప్రార్థనలు (పూజలు), రోగాలు నయంకావాలని తాయెత్తులు,రక్షరేకులు ధరించడాలు అలాంటివే"

అద్భుతాలు నిజాలుకావని నొక్కిచెప్తూ అన్నాడిలా—

"దేవుడికికూడా అసాధ్యమయిన విషయాలను సృష్టించే అధికారం, శక్తి లేదనేది అందరూ ఒప్పుకున్న విషయం."

"ప్రకృతిలోని తక్కిన పదార్థాల-వ్యక్తుల పుట్టుకవంటిదే ప్రవక్తల జన్మకూడా. వారు చెప్పిందీ దేవునితో నిమిత్తంలేకుండా బహిరంగ కారణాలమీదనే ఆధారపడి వుంటుంది" అని ప్రామాణిక సత్యాన్ని వివరించాడు.

# ఉద్యోగ జీవితం

ఈస్టిండియా కంపెనీవారి రెవిన్యూ శాఖలో ఉద్యోగంలో చేరాడు. పూర్వీకులు సంపాదించి ఇచ్చిన స్థిరచర ఆస్తులు లేనప్పుడు బ్రతుకు సాగడానికి ఏదో ఓ పనిచేస్తూ ఇంత సంపాదించుకోవల్సిందేకదా. అలా ఉద్యోగ కారణంగా ఆయన భాగల్పూర్, రాంనగర్ తదితర ప్రాంతాల్లో నివసించాడు.

1809లో రంగపూర్‌కు బదిలీ అయింది.

1814 వరకు అక్కడి జాన్‌డిగ్బీ దొరకు దివాన్‌గా గడిపాడు.అక్కడ తీరిక సమయాల్లో కొత్త పుస్తకాలు చదవటంలోనూ, చర్చలతోనూ గడిపేవాడు. రంగపూర్‌లోనే హరిహరానంద తీర్థస్వామి అనే తాంత్రిక పండితుని పరిచయంతో తాంత్రిక సాహిత్యం చక్కగా చదివాడు.

రంగపూర్ ఆ దినాల్లో వివిధ మతస్థులకు కూడలిగా వుండేది. వర్తక వ్యాపారాలకోసం జైనులు ముస్లింలుకూడా వచ్చేవారు. ఇస్లామీ మత సాహిత్యాన్ని పాట్నాలోనే చదివాడు. ఇప్పుడు జైనులతో పరిచయం పెంచుకొని కల్ప సూత్రం మొదలైన జిన గ్రంథాలు చదివాడు. టిబెట్‌లో బౌద్ధాన్ని, కాశీలో హిందూమత ధర్మాల్ని గ్రహించాడు.

డిగ్బీదొర దగ్గరికి ఇంగ్లాండునుంచి వచ్చే ఆంగ్ల పత్రికలు చదువుతూ ఇంగ్లాండు ఐరోపా రాజకీయాలగూర్చి తెల్సుకునేవాడు. తాను అంతకు పూర్వం ఇరువది రెండవయేట నేర్చుకోవడం మొదలుపెట్టిన ఇంగ్లీషును ఆ ఆంగ్ల అధికారి సాయంతో పెంచుకున్నాడు.



సమయం వృధాచేయడం ఆయనకు నచ్చేదికాదు. ఏది పోయినా తిరిగి వస్తుందేమోకాని గడచినకాలం మాత్రం రాదు. కాలం అమూల్యమైనది. దానిని సద్వినియోగ పరచుకునేవారే అధిక ప్రయోజనం పొందగల్గుతారు.

## కలకత్తా చేరాడు

1914లో డిగ్బి ఇంగ్లాండు వెళ్ళాడు. రామ్మోహన్‌రాయ్ కంపెనీ ఉద్యోగం వదిలేసి కలకత్తా చేరాడు. కేవలం బ్రతకడంకోసం నౌకరితో కాలం

వెళ్ళబుచ్చడం ఆయనకు నచ్చలేదు. ఆ పని ఎవరైనా చేయగలరు ఇంకా వున్న తంగా ప్రజా వుపయోగ కార్యాలలో పరిశ్రమించాలనే సంకల్పం రాయ్‌ది.

జనాన్ని నూతనకాలానికి తగిన వివేకవంతులుగా మలచాలనే ఆలోచన కలిగింది. అందుకు తోడుగా నిలిచింది అతని విజ్ఞానం—బలంగా నడిచింది కలం.

రచనలు-ప్రచురణలు, సభలు-పండిత గోష్ఠులు ఇవే ఆయన దినచర్య అయినవి. ఆయన ఏది వ్రాసినా చెప్పినా సత్యాన్నిగూర్చే. హేతువాదానికి ఎంతో విలువిచ్చాడు.

"హేతువాదానికి పొసగే విషయాన్ని ఒక పాపాయి చెప్పినా అంగీకరించాలి. బ్రహ్మ అంతటివాడు చెప్పినా హేతువాదానికి సరిపడని అంశాలను ఒప్పకూడదు." అన్నాడు రాయ్,

ఇదీ ఆయన బోధన-ఆచరణ. ఆ తర్వాత పందేండ్లకు ఆంధ్రదేశ యుగకర్త శ్రీ కందుకూరి వీరేశలింగం(1848—1919) అదే మార్గాన్ని అనుసరించడం రాయ్ ప్రతిభకు తార్కాణం. విశ్వకవి రవీంద్రనాథ్ వంటి ఎందరో మేధావులు ప్రశంసించడం రాయ్ గొప్పతనానికి నిదర్శనం.

## ఆత్మీయ సభ స్థాపన

1915లో కలకత్తా నగరంలో 'ఆత్మీయసభ'ను నెలకొల్పాడు. ఆ సంస్థ ద్వారా జనంలో విజ్ఞానాన్ని పెంచి సంఘ సంస్కారాన్నికలిగించడానికి కృషిచేశాడు.

కుల వ్యవస్థను తీవ్రంగా వ్యతిరేకించాడు.

కులము కులమటంచు కుంపిచనేటికి
పాదు ఉన్నచోట ప్రబలు విత్తు
హెచ్చుతగ్గు మాట లెల్లెరుంగవచ్చు
విశ్వదాభిరామ వినురవేమ.

వృత్తులకోసం ఏర్పడిన జాతులు (భగవద్గీత), ఉపవృత్తులవల్ల ఏర్ప డిన కులాలు, భారత జాతిని ముక్కలు ముక్కలుచేసి ఐక్యతను చంపినై. జాతి కుల మత విభేదాలులేని మానవ నవసమాజాన్ని రూపొందించడం ఆయన ధ్యేయం. ఇది ఒక్క భారతదేశానికే కాక విశ్వమానవులందరికీ సంబంధించిన విషయంగా రాయ్ గుర్తించాడు. జాత్‌నపూఛో సాధ్‌కీ మూల్‌కరోతల్‌వార్‌కీ-కబీరు.

నిజానికి భారతదేశంలో వర్ణవ్యవస్థ ఆర్యులతో ఏర్పడిందని ముఖ్యంగా బ్రాహ్మణులు వీటిని ఏర్పరచారని నిందిస్తారు. కాని-తెగల రూపంగా రక్తం కల్తీ కాకుండా జాతులను కాపాడుకునే లక్షణం మన దేశంలో అటవికులకు నాడేకాదు నేడూ వుంది. అదే ఆచారాన్ని మరికొంత నియమబద్ధంగా కాపాడినవారు ఆర్యులు అయినా వర్ణసంకరం—జాతుల కులాల కలయిక జరుగనే లేదనికాదు. ఎందరెందరో సాధులు-కవులు కులమత విభేదాలు కూడదని ప్రబోధించారు. అయినా అవి ఇప్ప టికీ బాగానే వేళ్ళు పాతుకొని వున్నాయి.

'ఆత్మీయ సభ' ద్వారా కుల వ్యవస్థను వ్యతిరేకించాడు.

'కన్యాశుల్కం'ను నిరసించాడు. డబ్బు తీసుకొని కన్యలనిచ్చి పెళ్ళి చేయడం ఒకవిధంగా తండ్రులు తమ కూతుళ్ళను అమ్ముకోవడంగా ఆయన భావిం



చాడు. నిజానికి కన్యాశుల్కం వేద సమ్మతమే వధువు తండ్రి వరుని నుంచి కొన్ని గోవులను తీసుకొని పుత్రిక నివ్వటం ఆర్షవివాహంగా పేర్కొనబడింది.

కాని పలువురు పూర్వ శాస్త్రకారులు దీనిని నిరసించారు.

ఆటవికుల్లోనూ ఈ ఆచారముంది.

ఈ కన్యాశుల్కం కారణంగా డబ్బున్న వృద్ధులు చిన్న వయసులో ఉన్న కన్యలను పెళ్ళాడేవారు. వాళ్ళు కొద్ది కాలానికే మరణిస్తే వీళ్ళు వితంతువులయ్యే వారు. గురజాడవారి ప్రఖ్యాత నాటకం "కన్యాశుల్కం" కథా వస్తువు అదే.

ఇప్పటికి పలు అటవిక జాతుల్లో కన్యాశుల్కం అమలులో వుంది. అరబ్బులు డబ్బిచ్చి నచ్చిన అమ్మాయిలను వయసుతో నిమిత్తంలేకుండా పెళ్ళాడటం ఇప్పటికీ చూస్తున్నాం. ధనాన్నిబట్టి భోగం-దర్పం గలవారినిబట్టి ధర్మసిద్ధాంతాలు.నాగరికుల్లో కన్యాశుల్కం అంతరించి మహా భయంకరంగా వరకట్న వ్యాధి వ్యాపించివుంది. ఇది రాజరిక వ్యవస్థలో రూపుదిద్దుకొని ఈ పెట్టుబడిదారీ తరంలో పెంపొందిన మహామారి. కన్యాశుల్కం ఆటవిక దశలోనే పుట్టింది.

అరేబియా, ఆఫ్రికా దేశాల్లో బానిసలను అమ్మినట్లు ఇక్కడకూడా కొన్నేండ్లకు ముందు దూరప్రాంతాలనుండి యువతులను తెచ్చి అమ్మేవారు వివాహాల రూపేణకూడా.

స్త్రీల పక్షంగా నిలిచి ఆస్తి హక్కుకోసం కూడా పోరాడాడు రాయ్. ఆ విషయం తర్వాత చూద్దాం.

సనాతనులయిన హిందువులు, పూర్వాచార పరాయణులయిన క్రైస్తవులు, రామ్మోహన్‌రాయ్‌ను తీవ్రంగా వ్యతిరేకించారు. కలకత్తాలోని హిందూ పండితుల "ధర్మసభ" రాయ్‌కు పోటీగా యేర్పడింది. "సమాచార చంద్రిక"పత్రిక ద్వారా ఆయనపై కారాలు మిరియాలు నూరుతూ యెన్నో నిందలు కురిపించ సాగారు. అయినా ఆయన వీటికి బెదరలేదు.

"నేను హిందూ మతాన్ని ఎప్పుడూ వ్యతిరేకించలేదు. మూఢాచారాలను స్వపక్ష దురభిమానాన్ని మాత్రమే కూడదన్నాను" అని రాయ్ సంజాయిషీ ఇచ్చుకున్నా, సనాతనులకు ఆయనపై కోపం పోలేదు. రాయ్ రక్తాన్ని కళ్ళచూడాలనే ఉద్రేకంతో ఊగిపోయారువారు.

# వేదాంత గ్రంథ రచన

1815లో "వేదాంత సూత్రము"ను సంస్కృతంనుండి బెంగాళీలోనికి అనువదించాడు.

1816లో "వేదాంతసారం"ను వంగభాషలోనికి మార్చి ఆ తర్వాత దానిని ఆంగ్లభాషలోనికి మార్చాడు.

మన పూర్వమత గ్రంధాలు గొప్పవని విని వాదించేవారేకాని వాటిని చదివినవారు తక్కువ.భారతీయ వేదాంత గ్రంథాలు సంస్కృత భాషలో వున్నాయి సంస్కృతం భారత భాషలన్నింటిలో కల్పివున్నా విడిగా ఆ దేవభాష చదవాలంటే సాధ్యంకాదు. సంస్కృతం నేర్చినవారు తక్కువ. బహు ప్రయాసపడి ఏకొందరో సంస్కృతం అభ్యసించిన పండితులున్నా వారికి ఆ గ్రంథాలపై భక్తిభావం ఎక్కువ. సత్యాసత్యాల వివేచనకు పూనుకోరు. అందుకే రాయ్ ప్రాచీన వేదాంత గ్రంథాలను తన మాతృభాషలోనికి అనువదించాడు. దానివల్ల జనం వాటిని చదివి ఆలోచించ గలుగుతారు. దానివల్ల తాను వాదించే విషయాలను సత్యాలను సులభంగా అర్థం చేసుకోగల్గుతారు.

అప్పటి క్రైస్తవ పండితులతో సత్య విషయాన్ని గూర్చి తరచు చర్చలు జరుగుతుండేవి. వాళ్ళకు హిందూ వేదాంత పరిచయం వుంటే రెండు మతాలను తులనాత్మక పరిశీలన చేసేవీలు కలుగుతుందని వేదాంత గ్రంథాలు ఆంగ్లంలోకి మార్చాడు రాయ్.

1923లో 'హిందూ స్త్రీలపై దురాక్రమణ' గ్రంధరచన చేశాడు.

1817లో కఠోపనిషత్తును మాండూక్య ఉపనిషత్తును వంగ భాష లోనికి తెచ్చాడు. వేదాంత గ్రంధాలను బెంగాళీ ఆంగ్ల భాషల్లోకి అనువదించడం రాయ్‌తోనే అరంభమైంది.

1927లో 'వజ్రసుచి' అనే మృత్యుంజయిని సంస్కృత పుస్తకం పరిష్కరించి ప్రచురించాడు. అది వర్ణవ్యవస్థను వ్యతిరేకించేది. ఏ పనిచేసినా తీర్థం -స్వార్థం అన్నట్లు తన భావాలకు అనుకూలంగా ఉండేట్లు చూసేవాడు రాయ్.

## కలకతా యూనిటేరియన సంస్థ ఆవిర్భావం

తన వుద్యమాన్ని ఎవరి ప్రీతికోసమో విరమించే తత్త్వం కాదు రాయ్‌ది. సత్యశోధనకోసం ఏ మతాల్లోని తప్పులనైనా బాహాటంగా విమర్శించే వాడు. అప్పుడప్పుడే ఈ దేశంలో వ్యాప్తికొకి వస్తున్న క్రైస్తవాన్ని ఎదిరించాడు.

1821లో కలకత్తా యూనిటేరియన్ సంస్థ రామ్మోహన్ మార్గదర్శ కత్వంలో నెలకొంది. దానికి ఆయన అర్థికంగానూ సహకరించాడు. ఆత్మవాది అయిన రాయ్ ఐహిక, అర్థిక విషయాలను దృష్టిలో వుంచుకొని ఆ సంస్థ నియమావళిని రూపొందించాడు. స్వార్థ ప్రయోజన దృష్టి ఏనాడూ లేదు. ఇతర వేదాంతులవలె పారమార్థిక విషయాలకు విలువిచ్చి ప్రాపంచిక విషయాలను త్రోసి పుచ్చలేదు. ముక్తి అనేది ముక్కలు రూపంలోకాక సంపూర్ణంగా వుండాలని భావిం చాడు.

"ఏవి విద్యవల్ల కలిగే లాభాలను వ్యాపింపజేస్తాయో, ఏవి అజ్ఞానం మూఢవిశ్వాసం స్వమత దురభిమానం వైరి ఆవేశాలను నశింపజేస్తాయో, ఏవి నైతిక సిద్ధాంతాలను పరిశుభ్రపరుస్తాయో, ఏవి విశ్వవ్యాపకమైన దయనూ దాన గుణాన్నీ పెంపొందింపజేస్తాయో, అవన్నీ దీని నిర్మాణ పరిధిలోకి వస్తాయి. ఈ దేశంలోని అసంఖ్యాకులైన దీని ప్రజల పరిస్థితి మెరుగు పరచడం, ప్రజలకు వుప యోగ కరాలైన కళలను ప్రోత్సహించడం, శ్రమించే అలవాటును పెంపొందింప జేసి తద్వారా ప్రజల కుటుంబ సమాజ సౌఖ్యాలను పెంపొందించడం ఈ సంస్థ తన ధ్యేయంగా భావిస్తున్నది. ప్రకృతి, సంఘం, ఈ రెండింటి ప్రాథమిక అవస రాలు పూర్తిగా తీరితే తప్ప, బుద్ధి సౌశీల్యం మతం మొదలైనవాటి అభివృద్ధిని ఉన్నత స్థాయిలో సాధించడం సాధ్యంకాదని అనుభవం నిరూపించింది." అన్నా రాయన.

## క్రైస్తవ మతబోధకులతో పేచి

ఆ కాలంలో బెంగాళ్‌లో క్రైస్తవ మతబోధకుల సందడి అధికంగా వుండేది. సెరాంపూర్ క్రైస్తవులకు కేంద్రం. అప్పటికి కలకత్తా మద్రాసులు ఆంగ్లేయులకు వశపడినా ఢిల్లీ స్వాధీనం కాలేదు. మతబోధకులుగా వచ్చిన మొదటి బృందాలవాళ్ళు పండితులు-భక్తులు. వారిలో కొందరు బెంగాళ్ వున్నతికి కారణమై నారు. అయితే వారు అమాయకులైన దేశప్రజలను తమ మతంలోనికి మార్చుతూ జన నిందకు పాత్రులయ్యారు. పైగా స్వమత పక్షపాత ధోరణితో హిందూ మతాన్ని తీవ్రంగా వ్యతిరేకించేవారు. ఆ విమర్శలో హిందూమత పరిచయం లేని తనం స్పష్టంగా కనిపించేది.

వారిని ఎదుర్కొనే తలంపుతో రాయ్ 'బ్రహ్మన్ సెబది' అనే వంగపత్రికను, 'బ్రహ్మోనికల్ మాగజైన్' అనే ఆంగ్ల పత్రికను నడిపించసాగాడు.

క్రైస్తవులు బలపరచే త్రిక సిద్ధాంతం (Trinitarianism)ను ఘాటుగా విమర్శించేవాడు.

దేవుడు-దైవకుమారుడు-పవిత్రాత్మలు, ఈ మూడు రేఖలతో దైవత్వం త్రిభుజంలాంటిదని క్రైస్తవుల ప్రచారం.

దానికి రాయ్ ఆక్షేపణలివి—

మూడు రేఖలతో త్రిభుజం ఏర్పడినట్లు ముగ్గురు వ్యక్తులు కల్పి ఒక దైవాన్ని రూపొందింపజేస్తే, మూడు అంశాలకు సమాన ప్రత్యేక స్థితి లభించి దైవం వునికికే భంగం కల్గుతుంది. న్యూటన్‌వంటి శాస్త్రజ్ఞులు ఈ త్రిక సిద్ధాంతాన్ని భావించలేదు, అన్నాడు.

దైవాన్ని త్రిభుజంతో పోల్చినప్పుడు అందులో ఏదీ దైవం కాదు త్రిభుజంలోని ఏ భుజమూ త్రిభుజం కాదుకదా.

క్రైస్తవులు దేవుని త్రిభుజంతో పోలిస్తే, హిందువుల్లో చతుర్భుజంతో పోల్చేవారున్నారు. ఇలా దైవస్వరూపం మారిపోతుంటే చివరికి ఏది స్థిరం-నిజం ?

త్రిభుజంలో మూడు భుజాలూ ప్రత్యేకత కలవి కనుక దేవునికి ఏ మహత్వమూ అన్వయించదు. ఈ త్రిక సిద్ధాంతంవల్ల బహుభుజుల నేర్పరచుకొని హిందువులు తమ బహుదేవతారాధనలను సమర్థించుకోవడానికి చక్కగా వుపయోగపడుతుంది. అని యుక్తియుక్తంగా చర్చించాడు.



1820 నుంచి 23 వరకు ఆయన క్రైస్తవులతో చర్చలు సాగించాడు. ఏసుక్రీస్తు బోధనలను ఉత్తమమైనవిగా రాయ్ అంగీకరించాడు. కాని, ఆయన మాయలను మహిమలను త్రోసిపుచ్చాడు.

## నిందలను సహనంతో ఎదుర్కొన్నాడు

సెరంపూరులోని క్రైస్తవ పత్రికలన్నీ హిందూమతాన్ని రామ్మోహన్ రాయ్ ఏకేశ్వరోపాసనను విమర్శించడం పనిగా పెట్టుకున్నాయి.

మౌనం ఓటమి క్రిందికి వస్తుంది, రానీ అనుకుంటే అది అన్యమత స్థల దాడికి కారణం కావచ్చునని రాయ్ అనుమానం. అందుకే బ్రహ్మనికల్ మాగజైన్ నాలుగవ సంచికలో ఇలా వ్రాసాడు.

"ఈ పత్రిక మూడవ సంచికలో మత సంబంధమైన చర్చలలో బాధాకరమైన మాటలు వుపయోగించకూడదని నేను వినయపూర్వకంగా మనవి చేశాను. అయినా మతబోధకుల పత్రికల్లో—వారు పంచిన ఒకచిన్న కరపత్రంలో, వేదాలలోని సిద్ధాంతాలను నాస్తిక వాదాలుగా వారు నిరసించారు. వాటిని అనుసరిస్తున్న మా గురించి అవసరమైన విసుర్లు విసరడం నాకు ఆశ్చర్యాన్ని బాధనూ కల్గిస్తున్నాయి. ఇదే దాదాపు రెండేండ్ల తర్వాత బ్రహ్మనికల్ మాగజైన్ నాలుగవ సంచికను ప్రచురించడానికి నన్ను పురికొల్పింది.

దేన్నయినా సహించగల సరళమైన ఉదారమైన భావం హిందూ మతం యొక్క ప్రాథమిక సిద్ధాంతం. దానికి అనుగుణంగా నేను ఏ మతాన్నీ అందులో క్రైస్తవ మతాన్ని ఎదుర్కోవడానికి సిద్ధంగాలేను. అదీకాక ఆ బోధకులపట్ల నాకున్న గౌరవం ఆ మతంలోని తప్పుల గురించి నన్ను విమర్శించనీయడం లేదు. క్రైస్తవ రచయితలు ఇప్పటికింకా హిందూమతాన్ని గూర్చి అవివేకంగా వ్రాసి తమ తప్పులను నా దృష్టికి తెస్తున్నారు. మన ఈ రెండు మతాలను తులనాత్మక పరిశీలన కావించి ఒక నిర్ణయానికివస్తే బాగుంటుందని నా కిప్పటికీ అనిపించుతూనేవుంది. అయితే వారు సాహిత్యశీలానికి, సత్యాన్వేషకులకు అనువయిన నాగరిక భాషలో చర్చ కొనసాగిస్తే అది మరింత బాగుంటుందని నా అభిప్రాయం."

త్రిక సిద్ధాంతాన్ని వ్యతిరేకించిన రామ్మోహన్‌రాయ్ వాదనను ఎదుర్కో

లేక 'శేషం కోపేన పూరయేత్' అన్నట్లు డాక్టర్ మార్ష్మన్ అనే క్రైస్తవ బోధకుడు హిందూ మతాన్ని నిందిస్తూ అది "అబద్ధాలపుట్ట" అని వ్రాసాడు.

అందుకు జవాబుగా రామ్మోహన్ "మనం మత సంబంధమయిన చర్చల్లో నిమగ్నమైవున్నామని మరచిపోకూడదు. పరస్పరం తిట్టుకోవడంవల్ల ప్రయోజనంలేదు" అని హితవు చెప్పాడు.

స్పర్థయా వర్ధతే విద్యా—అన్నట్లు నిదానంగా ఆలోచిస్తూ విషయచర్చ సాగించాలిగాని అనవసరముగా ఆవేశానికి లోనుకాకూడదని రామ్మోహన్ అభిప్రాయం. మంచి ఎదుటి వారిలోవున్నా స్వీకరించాలి. చెడు తమలో వుంటే తొలగించుకోవాలి, అనేది ఆయన మనస్తత్వం. ఈ చర్చల సందర్భంలో 'ఇండియా గెజిట్' పత్రిక రామ్మోహన్‌ను యెంతగానో ప్రశంసించింది.

బుద్ధికుశలత, తార్కిక పరిజ్ఞానం, వాదనలో సహనం చూపే ఆయన వ్రాసిన ప్రతి పదం, మాట్లాడిన ప్రతిమాటా హేతువాదాన్ని విశ్వజనీనతను ధర్మనిష్టనూ వెల్లడి చేస్తాయని మెచ్చుకొంది.

రాయ్‌లోని సుగుణం న్యాయ ధోరణి, ఎదుటివారు సకారణంగా తనలోని దోషాన్ని తెలియజేస్తే అంగీకరించడానికి వెనుదీసేవాడుకాదు.

బైబిల్ మూలగ్రంథం చదవకుండా క్రైస్తవ మత చర్చలకు పూనుకోవటం తగుతుందా? అనే ప్రశ్నవిని రామ్మోహన్ తన లోపాన్ని అంగీకరించాడు. వెంటనే లాటిన్ హీబ్రూ భాషలు నేర్చుకోవటం ఆరంభించాడు.

బ్రహ్మనికల్ మాగజైన్ నాలుగవ సంచికలో రాయ్ "శివప్రసాద శర్మ" అనే పేరుతో ఒక వ్యాసం వ్రాసాడు. శీర్షికపేరు "క్రైస్తవ మతాన్ని

నిరసించడానికి ఒక హిందువు చెప్పే కారణాలు."అందులో త్రిక సిద్ధాంతం, క్రీస్తు పాపపరిహారం కావించే అంశం, రెండూ పరస్పర విరుద్ధాలని ఒకే మతంలో అవి రెండూ వుండటం పొసగదని వాదించాడు.

మనమంతా పుట్టుపాపులము, ఏసుప్రభువు శరణు జొచ్చిననే పాప పరిహారం లభిస్తుంది-అనే ఆ మత విశ్వాసాన్ని నవయుగ కవిచక్రవర్తి జాషువా సైతం నిరసించి మతపెద్దల కోపానికి గురియై "సంఘ బాహ్యుడనైతి క్రైస్తవుల యందు" అన్నాడు.

సత్య సంశోధన తప్ప ముఖప్రీతి వచనాలు రాయ్‌కు చేతకావు. ఏసు బోధలు-పీఠికలో ఇలా అన్నాడు.

"ఈ కారణాలవల్ల నేను ఈ విషయాల చర్చలో పాల్గొనడానికి ఇష్ట పడుతూ లేను. నా దృష్టి క్రీస్తు మాటలను ఆంగ్లభాషనుంచి సంస్కృతంలోకీ, వంగభాషలోకీ అనువదించడంలో నిమగ్నంచేసి నా సాటి ప్రజలముందు పెడు తున్నాను" అన్నంతపని చేసాడు.

ఆయనకు వాదోపవాదాల్లో పాల్గొనడమంటే ఇష్టం. వేదాంతంలోనూ జ్ఞానంలోనూ తాను సమర్థుడే అయినా, ఆయన సాధారణ అభిప్రాయాల ద్వారా కాక, విచక్షణ పూర్వకమయిన తర్కంద్వారా తన అభిప్రాయాలు వెల్లడిస్తాడు. అలాగే హిందువుల పాండిత్యంతో కూడిన వేదాంతానికి సాటిరాగలవి యూరోపి యన్ గ్రంథాల్లో లేవని ఆయన నొక్కిచెపుతాడు"

## లండనుకు కృతజ్ఞత లేఖ

1824లో డాక్టర్ టి. రాస్, లండన్‌కు-రామ్మోహన్ వ్రాసిన ఉత్తరములో మరికొన్ని విషయాలు తెలుస్తాయి.

"గౌరవనీయులయిన ఆర్యా-

నా చిరునామాకు గత జూన్ 16వ తేదీన మీ ఉత్తరంతోపాటు పుస్తకాల పార్శిల్ చేరి నాకు సంతృప్తి కలిగించాయి. "ఏసు బోధనలు" అనే నా రచనను, దాన్ని సమర్ధిస్తూ వ్రాసిన మరి రెండు రచనలనూ తిరిగి ముద్రించడం ద్వారా, బృందంవారు నాకు కల్పించిన గౌరవం గర్వకారణం. మీ బృందసభ్యులకు వారి ప్రశంసలకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు అందించవల్సిందిగా ప్రార్థిస్తున్నాను.

క్రీస్తు బోధించిన నిర్మలమయిన, సాధారణమయిన, ప్రయోగాత్మకమయిన మతాన్ని, దానికి రోమనుల పరిపాలన కాలంలో క్రమక్రమంగా చేర్చబడిన అజ్ఞానంతో కూడిన సిద్ధాంతాలనుంచీ, అసంబద్ధమయిన అభిప్రాయాలనుంచీ వేరుచేయాలన్న తలంపుతో యూరోపులోనూ, అమెరికాలోనూ సత్యమిత్రులు ఇందరు కృషిచేస్తున్నారనడం నాకు యెంతో సంతోషాన్ని కల్గిస్తున్నది. ఈ మహనీయుల ప్రయత్నాలు లూథర్ తదితరుల విజయమంతటి ఘనమైనవిగా వుండాలని నేను మనసారా కోరుకుంటున్నాను...వారికి ప్రపంచ కృతజ్ఞతలు అందజేస్తుంది" అదీ ఆయన వినయం—సంకల్పం.

"సర్వోత్కృష్ట తత్త్వవేత్తలు" అనే రాయ్ పుస్తకంకూడా ఇలాగే విదేశీయుల ప్రశంసలకు కారణమయింది.

## విద్యా సంస్కరణ

రాజారామ్మోహన్ దృష్టి విశాలమయినది. ఆయనది ముందుచూపు. ఆయనకాలంలో ఆంగ్లేయపాలనకు వ్యతిరేక పోరాటం అక్కడక్కడ సాగిస్తున్న వారు రాజులు. ఆ తర్వాత వందేండ్లకు కానీ ప్రజా స్వాతంత్ర్య ఉద్యమాలు ఊపునందుకోలేదు.

1823లోనే విద్యావిషయంలో సమూలంగా మార్పురావాలని ఆంగ్ల ప్రభుత్వానికి సూచించాడు రాయ్. ఈ దేశ విద్యావిధానాన్ని సంపూర్ణంగా మార్చక పోతే వందేండ్లుగా మహ్మదీయుల ఆంగ్లేయుల పాలనా దాస్యంతో చేవచచ్చియున్న భారతజాతికి విముక్తిలేదని ఆయన గ్రహించాడు.

రాజారామ్మోహన్ ప్రాచీన గురుకుల విద్యావిధానాన్ని మత పురాణ సంస్కృత సాహిత్యబోధనను అభిమానించలేదు. ప్రపంచ దేశాల్లో మనం తలెత్తు కొని తిరగాలంటే హేతుబద్ధమూ, వైజ్ఞానికమూ అయిన విద్య అవసరం అని భావించాడు.

ఆంగ్ల ప్రభుత్వం భారతదేశంలో సంస్కృత పండితుల పర్యవేక్షణలో సంస్కృత పాఠశాలలను నెలకొల్పి ఈ దేశ ప్రాచీన విద్యలను బోధించాలని సంకల్పించినప్పుడు దాన్ని ఆయన వ్యతిరేకించాడు. జీవశాస్త్రం, భౌతికశాస్త్రం, రసా

యనిక శాస్త్రం, గణితం వంటి వైజ్ఞానిక విషయాలను ప్రధానంగా బోధించాలని కోరాడు.

11 డిసెంబర్ 1823న అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్ ఆమ్‌హెస్ట్‌కు వ్రాసిన లేఖలో ఇలా పేర్కొన్నాడు రామ్మోహన్.

"ప్రభుత్వంవారు హిందూ పండితుల పర్యవేక్షణ క్రింద ఒక సంస్కృత పాఠశాలను నెలకొల్పి ఇదివరలో భారతదేశంలో వ్యాప్తిలోవున్న ప్రాచీన విద్యను బోధించాలనే ఏర్పాట్లు చేస్తున్నారు. ఈ పాఠశాల, లార్డ్ బేకన్ కాలానికి ముందు యూరోపులో ఉన్న పాఠశాలలవలె, పసివారి బుద్ధిని వ్యాకరణ విషయాలతోనూ, తత్త్వ విచారాలను నింపడానికి మాత్రమే వుపయోగపడుతుంది. వాటివలన సమాజానికి కొద్దిపాటి ప్రయోజనం కలిగితే కలుగవచ్చును; లేకుంటే ఏ వుపయోగమూ వుండకపోవచ్చును. ఈ పాఠశాలల్లో చదివే పిల్లలు ఇప్పటికి భారతదేశంలోని అన్నిభాగాల్లోనూ వున్న పిల్లలూ రెండువేల యేండ్లకు పూర్వమునాటి చదువే నేర్చుకుంటారు. దాంతోపాటు ఆ తర్వాతి కాలంలో హిందూ పండితులు రూపొందించిన వ్యర్థ విషయాలను, శుష్కచమత్కారాలను నేర్చుకుంటారు.

బ్రిటన్ దేశాన్ని సత్యమయిన జ్ఞానానికి దూరంగా ఉంచదలచుకొని వుంటే, బేకన్ తత్త్వాన్ని అనుమతించక, అంతకుముందు బళ్ళలోని బండచదువునే ప్రోత్సహించి వుండేవారు.

అలాగే సంస్కృత విద్యావిధానాన్ని అనుసరించడమే బ్రిటిష్ ప్రభుత్వంవారి విధానమయితే ఈ దేశాన్ని చీకట్లో వుంచడానికి అదే చాలు. బ్రిటిష్ పాలకులకు లోబడివున్న స్థానిక ప్రజల అభివృద్ధి ప్రభుత్వ కర్తవ్యంగా భావించితే



విజ్ఞాన వికాసానికి సహకరించే విద్యావిధానాన్ని ప్రోత్సహించాలి. ఆ విద్యావిధానములో గణితం, ప్రకృతిశాస్త్రం, రసాయన శాస్త్రం, శరీర తత్త్వశాస్త్రం మొదలైన ఉపయోగకరాలయిన ఇతర సైన్సులూ నేర్పాలి. అలా నేర్పడానికి ఇప్పుడు కేటాయించిన మొత్తంలోనే, యూరపులో చదువుకున్న విద్యావంతులను కొందరిని నియమించి కావల్సిన పుస్తకాలూ, పరికరాలూ, తక్కిన సామగ్రి అన్నీ అమరి వుండే ఒక విద్యాలయాన్ని నెలకొల్పవచ్చును."

అప్పటి ప్రభుత్వంలోని ఒక ఉన్నత అధికారి ఆ ఉత్తరాన్ని పనికి

రానిదిగా త్రోసాడు. కాని అదే అభ్యర్థనను ఇంచుమించు అర వైయేండ్ల తర్వాత లార్డు రిప్పన్ నియమించిన విద్యాసంఘం నిరభ్యంతరంగా, ఏకగ్రీవంగా ఆమోదించింది. ఆ తర్వాత పన్నెండు సంవత్సరాలకు మెకాలే పట్టుదలవల్ల ఆధునిక విద్యావిధానం అమలుపరచబడింది.

మెకాలే విద్యావిధానం ఆంగ్లమానస పుత్రులను తయారుచేసి, ఉద్యోగాలకు తప్ప (జీవితాలకు) పనికిరాని చదువు బోధించింది అని నిందించినా, అదే ప్రాచీన భావదాస్యంనుంచి తొలగించి విద్యార్థులను నూతన ప్రపంచానికి తగిన విజ్ఞాన శాస్త్రాలు అధ్యయనం చేయడానికి మార్గదర్శకమయింది. అందుకు మూల కారణం రామ్మోహన్‌రాయ్.

## హిందూ కళాశాల

1916లో దేశీయుల పట్టుదలవల్ల ఈ కళాశాల రూపొందింది. దానికి రాంమోహన్‌రాయ్ కృషి వుంది. కొందరు ప్రముఖులకు రాయ్ పొత్తు గిట్టలేదు. మంచి ఎవరి కారణంగా జరిగినా మంచిదే. తనవల్ల దానికి భంగం వాటిల్లకూడదని కమిటీనుంచి తాను తప్పుకున్నాడు.

పై విషయం 14 మే 1816 తేదీన సుప్రీంకోర్టు న్యాయమూర్తి సర్ హెడ్ ఈస్ట్, ఇంగ్లాండ్ జడ్జి జె. హారింగ్టన్‌కు వ్రాసిన లేఖతో తెలుస్తుంది.వివరాలు చూడండి.

"ఇటీవల ఇక్కడ ఆసక్తికరమూ, విచిత్రమూ అయిన పరిస్థితి ఒకటి రూపొందుతున్నది. కాలంతోపాటు అన్ని విషయాలూ మార్పుకు గురికాక తప్ప

దని నిరూపించుతున్నది. మే నెల ప్రారంభంలో కలకత్తాకు చెందిన ఒక బ్రాహ్మణుడు (రామ్మోహన్‌రాయ్) నన్ను చూడడానికి మా ఇంటికి వచ్చాడు. ఆయన నాకు పరిచితుడు, మేధావి. ఆయన ఇక్కడ స్థానిక ప్రముఖులమధ్య పలుకుబడి కలవాడు. మన ప్రముఖులలో చాలామందికి ఆయన సన్నిహితుడు. అతడు నాతో మాట్లాడుతూ చాలామంది హిందూ ప్రముఖులు, యూరోపియన్ ప్రముఖులు అనుసరిస్తున్న విధానంలో తమ పిల్లలకు విద్యాభ్యాసం జరిపించడానికి తగిన సంస్థను నెలకొల్పితే బాగుంటుందని అనుకుంటున్నారని నాతో చెప్పాడు. నా పర్యవేక్షణలో సమావేశం జరిపి, వారి ప్రయత్నానికి సహాయం చేయవల్సిందిగా కోరాడు. ఆయన వెళ్ళిపోయింతర్వాత నేను గవర్నర్ జనరల్‌గారికి జరిగిన విషయాన్ని గూర్చి తెలియజేసాను. ఆయన ఈ అంశాన్ని సుప్రీంకోర్టు కౌన్సిల్ ముందుంచగా, ఆ సభ్యులందరూ నేను అనుసరించిన విధానాన్ని ఆమోదించారు. మా ఇంట్లో ఆ హిందూ ప్రముఖులు సమావేశం కావడానికి ఎటువంటి ఆక్షేపణ లేదని సుప్రీంకోర్టు కౌన్సిల్‌వారు గ.జ. ద్వారా నాకు తెలియజేశారు. అందుకు 14 మే 1816 నాడు మా ఇంట్లో సమావేశం ఏర్పాటయింది. హిందూ ప్రముఖులు సంపన్నులు. ప్రముఖ పండితులు మొదలయినవారు యాభై మంది సమావేశానికి వచ్చారు. అప్పుడు దాదాపు యాభైవేల రూపాయిల విరాళాలు ప్రకటింపబడ్డాయి. మరిన్ని విరాళాలు చేయగలమని చాలామంది హామీ ఇచ్చారు. ఆరోజు కార్యక్రమాన్ని ప్రారంభించడానికి ముందు వచ్చిన పెద్దమనుష్యులు పలువురితో నేను సంభాషించాను. ముఖ్యంగా బాగా పలుకుబడి వున్న ఒక ధనిక బ్రాహ్మణుడితో నేను మాట్లాడుతున్నప్పుడు రామ్మోహన్‌రాయ్ పట్ల ఆయనకు గల విరోధభావాన్ని గుర్తించాను. అందుకు కారణాలు-రాయ్ హిందువుల విగ్రహారాధనకు

వ్యతిరేకంగా రచనలు చేయడం, స్థానిక ప్రజలను తీవ్రంగా విమర్శించడం అని తెల్పింది."

అదీ సంగతి!

## ఇంగ్లీషు పాఠశాల ప్రారంభం

ఏకేశ్వరోపాసకుల సంఘం తరపున 1822లో ఆంగ్ల పాఠశాలను స్థాపించాడు. ఆ బడికయ్యే ఖర్చులన్నింటినీ రాయ్ స్వయంగా భరించాడు. ప్రభుత్వ సహాయం ఏమీ యాచించలేదు-రాలేదు.

డేవిడ్ హేర్, రెవరెండ్ విలియం ఆదం, ఆ పాఠశాల నిర్వహణలో పాల్గొన్నారు. రవీంద్రనాథఠాకూరు తండ్రి దేవేంద్రనాథఠాకూరు ఇదే బడిలో చదువుకొన్నాడు.తక్కిన పాఠశాలల్లో విజ్ఞాన శాస్త్రాల్ని ఆంగ్లంలో బోధిస్తుండగా ఇక్కడ మాత్రం వంగభాషలో బోధన జరిగేది.

ఇలా మాతృభాషలో విద్యాబోధన విషయంలోనూ ఆయనే మార్గదర్శి ఇంకా విగ్రహారాధన వ్యతిరేకతలోకూడా ఆర్యసమాజ వ్యవస్థాపకుడు స్వామీ దయానంద సరస్వతికి ముందే బాటను వేసినవాడు రాంమోహన్‌రాయ్.

## సంస్కృత పాఠశాల స్థాపన

సంస్కృత భాషా ద్వేషి అని స్థానిక పండితులతో నిందింపబడిన రాయ్ స్వయంగా ఒక సంస్కృత పాఠశాలను స్థాపించాడు.

1825లో ఈ విద్యాసంస్థ స్థాపించబడింది.

22 జూలై 1826న రెవరెండ్ విలియం ఆదం తన మిత్రునికి వ్రాసిన లేఖలో ఈ విద్యాలయాన్నిగూర్చి ఇలా వ్రాసాడు.

"ఇటీవల రామ్మోహన్ చిన్నదే అయినా చాల చక్కగా వున్న ఒక కళాశాలను పెంపొందించాడు. ఆయన దాన్ని వేదాంత కళాశాల అని పిలుస్తున్నాడు అక్కడి గొప్ప పండితులద్వారా హిందూ ఏకేశ్వరోపాసనను సమర్థించే పద్ధతిలో కొందరు యువకులకు సంస్కృత సాహిత్యాన్ని బోధిస్తున్నారు. దాని వ్యాప్తికి కృషిచేస్తున్నారు. దీనితోపాటు అక్కడ యూరోపియన్ విజ్ఞాన శాస్త్రాన్ని, క్రైస్తవుల ఏకేశ్వరోపాసన విధానాన్నికూడా బోధించాలనుకుంటు న్నాడు. అయితే ఆ బోధన బెంగాళీ భాషలోనో సంస్కృతంలోనో వుండా లంటాడు" ఆంగ్లంలో బోధించడం ఆయనకు ఇష్టంలేదు.

## పత్రికల ప్రచురణ

ఆదిమకాలంలో మాటలులేవు. సైగల ద్వారానే ఆటవిక మానవుల వ్యవహారాలు నడిచేవి. వివిధ భావాలకు అనుగుణమయిన వింత అరుపుల ద్వారానే భాష పుట్టింది. మాటలకు గుర్తుల రూపంలో వ్రాత వచ్చింది. చిత్రలిపి మొదటిది. అక్షరాలు ఆ తర్వాత రూపొందినై. అచ్చు ఒక వరప్రసాదమయింది. విజ్ఞానం సులభంగా ముద్రితమై గ్రంధాల రూపంలో బహుళ వ్యాప్తి పొందింది దానితో. ఆధునిక యుగంలో వార్తాపత్రికలు ఒక బలమయిన సాధనం. యాంత్రిక వాహ

నాలు వాటి పంపిణీకి అమితంగా సహకరిస్తున్నవి. రాయ్ తన భావ ప్రచారాని పత్రికల అవసరాన్ని ప్రాధాన్యతను గుర్తించకపోలేదు.

1816-20 వంగ వారపత్రిక "బంగళాగెజిట్"ను రామ్మోహన్ స్థాపించిన "ఆత్మీయసభ" మిత్రులు ప్రచురించారు.

1821లో "సంబర్ కౌముది" ప్రారంభమయింది. తారాచంద్, భవానీచరణ్ బంధోపాధ్యాయ ఆరంభించినా, రెండవ వ్యక్తి తప్పుకోవడంతో రాయ్ పత్రిక ప్రచురణ బాధ్యత వహించాడు.



1822 'మీరాట్ ఉల్ అఖ్‌బా' పార్సీలో ఆరంభించాడు ఆంగ్ల అధికారుల వ్యతిరేక రచనలు ప్రచురించాడనే నెపంతో 1823లో ఇది నిలిపివే బడింది. ఇదే సంవత్సరం పత్రిక శాసనానికి వ్యతిరేకంగా సుప్రీ కోర్టుకు విజ్ఞాపన పత్రాన్ని సమర్పించినా ప్రయోజనం లేకపోయింది ప్రభుత్వ కఠిన నిబంధనలను, మత ఛాందసాలను ఆయన పత్రికల్లో సూటిగా విమర్శిస్తుండడం, సత్యనిష్ట అధికారులకు మత బోధకులకి నచ్చలేదు. నైతిక సూత్రాలు సరేసరి. ప్రభుత్వానికి చక్కని సూచ లిచ్చేవాడు.

1820 నుంచి 1823 వరకు "బ్రహ్మోనికల్ మాగజైన్" సంచికలు, మ విషయాలు చర్చించడానికి ప్రచురించాడు.

1829లో డా॥ ఆర్.ఎం. మార్టిన్ ప్రారంభించిన "బెంగాల్ హెరాల్డ్ పత్రిక యాజమాన్యంలో రామ్మోహన్‌రాయ్, ద్వారకానాధ్ ఉన్నారు రామ్మోహన్ అనుచరుడు "నీలరతన్ హాల్దార్" బంగదూత్ సంపా దకుడు. ఆది వంగ, పారశీ, సంస్కృత భాషల్లో వెలువడేది. 1931లో రాయ్ మిత్రుడు శిష్యుడు 'ద్వారకానాధ్'మరియు అభిమాని'దేవేంద్ర నాధ ఠాకూర్ 'ఇండియా గెజిట్' ప్రచురించారు.

ఇవన్నీ రాయ్ భావ వ్యాప్తికి తోడ్పడినవే.

## రాయ్ రచనలు

1788లో "విగ్రహారాధనకు వ్యతిరేక రచన"చేసి ఇంటినుండి తండ్రిచే గెంటివేయబడ్డాడు రామ్మోహన్.

1810కి పూర్వం ముర్షిదాబాద్‌లో "ఏకేశ్వరోపాసకులకు ఒక కానుక" గ్రంథం రచించి ప్రచురించాడు.

1815 "వేదాంత గ్రంథం" బెంగాళీలో రచించాడు.

1816 "వేదాంతసార్" వంగ, హిందూస్తానీ భాషల్లో వెలువరించి, అదే "అబ్రిడ్జ్‌మెంట్ ఆఫ్ వేదాంత" పేరుతో ఆంగ్లంలోకి మార్చి ప్రచురించాడు.

1817 మాండూక్య కఠోపనిషత్తులను సంస్కృతంనుంచి బెంగాళీలోకి అనువదించాడు.

1818 సతీసహగమనాన్ని వ్యతిరేకిస్తూ బెంగాళీలో తొలిసారిగా వ్రాసాడు.

1820 "ఏసు బోధనలు" వంగ ఆంగ్ల భాషల్లో వెలువడింది.

1822 "స్త్రీల హక్కులు-సూచనలు" ఇంగ్లీషులో వ్రాసాడు.

1821-24 మధ్య 'సంబర్ కౌముది'లో ధ్వని-ప్రతిధ్వని, అయస్కాంతం గుణాలు చేపలు వాటి ప్రవర్తన, బెలూన్ వర్ణన మొదలయిన అనేక వ్యాసాలు వ్రాసాడు.

1828 ద్రుపద్ గీతాల రచన.

1833 వంగభాషా వ్యాకరణం, కలకత్తా పాఠ్యపుస్తక సంస్థ ప్రచురించింది. ఇంకా భూగోళశాస్త్రం, ఖగోళశాస్త్రం, జ్యామితి మొదలయిన వాచకాలు వ్రాసాడు.

రాయ్ తన పదహారవ ఏటనుంచి మరణ పర్యంతం కలాన్ని నడిపించిన సాహిత్యారాధకుడు-సాంఘిక ప్రయోజన సాధకుడు.

# బ్రహ్మ సభ స్థాపన

మతం విషయంలో రాయ్‌ది ఉదార వాదం. కఠిన వ్యర్థ నిబంధనలను యెంతమాత్రం అంగీకరించలేదు. ఆయన సమతావాది. అన్ని మతాల సారాన్ని-మంచిని అంగీకరించేవాడు. స్వమత పక్షపాతం లేదు.

రాయ్ హేతువాది. ఏ మతంలోనివి కానీ మాయలు, మంత్రాలు వంటి అద్భుతాలను కల్పనలుగా భావించి త్రోసిపుచ్చాడు. నామరూపరహితుడయిన సర్వేశ్వరుణ్ని మాత్రం విశ్వసించాడు.

మొదటినుంచీ ఆయన ఆలోచనలు, రచనలు అదే విషయాన్ని బల పరిచాయి. 1815లో ఆరంభించిన "ఆత్మీయ సభ"లోనూ, అంతకు పూర్వం ప్రచురించిన 'ఏకేశ్వరోపాసకులకు ఒక కానుక' పుస్తకంలోనూ, 1816 "వేదాంత సార్"లోనూ, 1820 'ఏసు బోధనలు'లోను తర్వాతి తన కృతికల్లోనూ అదే విషయాన్ని బలపరిచాడు.

1820 ఆగస్టు 20 నాడు "బ్రహ్మసభ"ను స్థాపించాడు.

1827లో ఏకేశ్వరోపాసకుల సంఘం గురించి డట్టన్‌కు వ్రాసిన లేఖలో రెవరెండ్ విలియం ఆదం ఇలా వివరించాడు-

"ప్రస్తుతం దాని సభ్యులు-సుప్రీంకోర్టు బారిస్టర్ థియోడార్ డికెన్స్, మెకింతోష్ అండ్ కంపెనీకి చెందిన వర్తకుడు జార్జ్ జేమ్స్ గోర్డన్, అటార్నీ విలియం టేట్, కంపెనీ ఉద్యోగి డాక్టర్ బి.డబ్ల్యు.మెక్లియడ్, మరో ఉద్యోగి

నార్మన్ కేర్, రామ్మోహన్‌రాయ్, ద్వారకానాధఠాకూర్, రాధా ప్రసాద్‌రాయ్ (రామ్మోహన్ పెద్దకొడుకు), నేను"

ఇది వెనుకబడడంతో బ్రహ్మసభ అరంభించబడింది.

చంద్రనాగూర్ "రాజకమల్ బసు" అనే వర్తకుని ఇల్లు బ్రహ్మసభ మొదటి విడిది గృహం. అది కలకత్తా చిత్పూర్ రోడ్డులోని 48 నం పెద్ద భవనం దీని మొదటి కార్యదర్శి రాయ్ శిష్యుడు తారాచంద్ చక్రవర్తి.



1830 జనవరి 23నాడు "బ్రహ్మసభ" వైభవంగా సొంతభవనానికి తరలివెళ్ళింది. ఆనాడు 500 మంది ఆ సభకు హాజరైనారు.

8 జనవరికి రాయ్ రూపొందించిన బ్రహ్మసభ ధర్మశాసనంలో ఇలా పేర్కొన్నాడు-

"అనంతుడు, అన్వేషణకు అందనివాడు, నిర్వికారుడు, విశ్వసృష్టికి కారణమైనవాడు, రక్షకుడు అయిన పరమాత్మను సక్రమంగా, శాంతంగా భక్తి శ్రద్ధలతో పూజించడానికి పూనుకునేవారందరికీ ఎటువంటి తేడాలేకుండా ఈ భవనాన్ని వుపయోగించుకోనివ్వాలి ధర్మకర్తలు. దీనిలోని స్థలాన్ని, ఇతర సౌకర్యాలను అన్నిరకాలవారు, అన్నిరకాల బహిరంగ సమావేశాలు జరుపుకోవడానికి, అన్ని సందర్భాల్లోనూ అనుమతించాలి. ఒక వ్యక్తికానీ, జన సమూహంకానీ పూజించే చేతనాచేతన పదార్థం దేనినీ దూషించడంకానీ, కించపరచడంకానీ, అపహాస్యం చేయడంకానీ కూడదు. అని బోధనరూపంలోకానీ, భక్తిగీతాల రూపంలో కానీ, పూజావిధానంలోకానీ సాగకూడదు (నిందలు). ఈ విశ్వకర్త రక్షకుడు అయిన దేవునిగూర్చి బోధించడానికి, ఆలోచించడానికి, ఇంకా దాన గుణాన్ని, నైతిక ధోరణిని, భక్తిని, దయాగుణాన్ని, సద్గుణాలను ప్రోత్సహించడానికి, వివిధ మతాలను అనుసరించేవారి మధ్య సమైక్యతా బంధాలను పెంపొందించడానికి కృషి జరగాలి."

బ్రహ్మసభను ఒక నూతన మతంగా రాయ్ ఏనాడూ భావించలేదు. ఏకేశ్వరోపాసకులయిన అన్ని మతాలవారికీ అది ప్రార్థన స్థలంగా ఎంచాడు. తాను ఏ ప్రత్యేక మతానికి చెందినవాడుగా రాయ్ అంగీకరించలేదు. తన మరణం తర్వాత

హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు తనను తమ తమ వ్యక్తిగా భావించుకుంటారని మిత్రులతో అన్నాడు. బొంబాయినుంచి రనడే ఈ సభనుగూర్చి ఇలా అన్నాడు-

"ఈ ధర్మశాసనపు పరతత్త్వభావం, గాఢభక్తి, విశ్వసోదర ప్రేమ-సహనం, సౌందర్యం, సమగ్రతలతో కూడిన ఆశయాన్ని సూచిస్తున్నాయి. వాటి పరిపూర్ణమయిన అర్థాన్ని గ్రహించడానికి ఇంకా శతాబ్దాలు పట్టవచ్చు"

## బ్రహ్మసభ - బ్రహ్మ సమాజం

1865 జూలై ఒకటి 'ఇండియన్ మిర్రర్' సంచికలో కేశవచంద్ర సేన్ మాటలు చదవండి.

"ఆయన (రామ్మోహన్‌రాయ్) ఇదివరకు వున్న ఏ మతానికీ చెందినవాడు కాడు. అలాగే ఆయన పరిశుద్ధమూ, దోషరహితమూ అయిన కొత్త మతం దేన్నీ స్థాపించడానికి కానీ, ప్రారంభించడానికికానీ పూనుకోలేదు. ప్రపంచంలో వున్న మతాలన్నిటినీ వాళ్ళ కులంతో, రంగుతో, మతంతో నిమిత్తం లేకుండా సమైక్యం చేసి అసలయిన ఒకే భగవంతుని పూజించే విశ్వజనీనమయిన వ్యవస్థను నెలకొల్పడమే ఆయన ఆశయం. ఆయన హృదయం విశాలమయింది. అది ఏ మతానికీ తెగకూ చెందిందికాదు. ఆయన ఏ మతసభలోనూ సభ్యుడు కాడు. కాని అన్ని మతసభలూ ఆయనవే. ఏకేశ్వరోపాసన సిద్ధాంతంపై ఆధారపడిన విశ్వజనీనమైన మత సభను నెలకొల్పడమే తన కర్తవ్యముగా భావించాడు.

అయితే బ్రహ్మ సభ పేరు బ్రహ్మ సమాజంగా రాయ్ అనంతరం మారినట్లే ఆయన ఉద్దేశ్యాలూ మారాయి."

1831 "రిఫార్మర్"లో ప్రసన్నకుమార్ ఇలా పేర్కొన్నాడు-

"వేదాంత సంస్థ అయిన బ్రహ్మసభ 1828లో స్థాపించబడింది. మేధావిగా ప్రసిద్ధుడయిన మన దేశస్థుడు బాబా రామ్మోహన్‌రాయ్ బుద్ధిమంతు లయిన మరికొందరు హిందువులతోకల్సి దానిని నెలకొల్పాడు...చిత్పూరు రోడ్డు లోని ఒక ప్రసిద్ధ గృహంలో ప్రతి శనివారం సాయంకాలం సభా సమావేశాలు సాగుతుంటాయి. అక్కడ వారు వేదాంత బోధలు వింటూ, అసలయిన ఒక భగ వంతుని గురించిన ప్రార్థనా గీతాలు పాడుతూ తమ సమయాన్ని వినియోగిస్తారు. ఈ ఆవరణలో సాగే కార్యక్రమాల్లో పాల్గొనడానికి క్రైస్తవులను ఇతర మతాల వారినికూడా అనుమతిస్తున్నారు"

బ్రహ్మ సమాజ బోధకులలో ప్రముఖుడైన సతీశ్‌చంద్ర చక్రవర్తి 1933 సెప్టెంబర్ 27 నాటి ప్రసంగంలో-

"తన సమాజం కొత్తమతానికి దేవాలయంగా వుండాలని రాయ్ భావించ లేదు. అది అన్ని తెగలవారూ ఒక్కగా నొక్క దేవుని ఉమ్మడిగా పూజించే సమైక్య కేంద్రంగా వుండాలని ఆయన ఆశించాడు. హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు తమ మతాలను అనుసరిస్తూనే ఒకటిగా పూజచేయవచ్చునన్న రామ మోహన్ విశ్వాసాన్ని, విశాల దృష్టినీ మనం తరచు సరిగా గ్రహించడంలేదు"

బ్రహ్మ సమాజ ప్రముఖ వ్యక్తి వేదాంత కళాశాల విద్యార్థి అయిన

మహర్షి దేవేంద్రనాథఠాకూరు నడిపిన పత్రిక 1847 అక్టోబర్ సంచికలోని అభిప్రాయం-

"కొన్ని సందర్భాల్లో ఇక్కడ ముస్లిం అబ్బాయిలు, క్రైస్తవ బాలురూ భగవంతుని ప్రశంసిస్తూ పారసీక భాషలో ఆంగ్లంలోనూ గీతాలు పాడారు." పై ఆక్షేపణలకు ఇది సంజాయిషీలా వుంది.

అదే పత్రిక 1854 సంచికలో ప్రముఖ రచయిత అక్షయకుమార్ దత్ మాటల్లో-

"ఆయన (రాయ్) కాలంలో బ్రహ్మ సమాజపు ఆచార్యులు ఉపనిషత్తులనుండి సంస్కృత శాస్త్రాలనుండీ శ్లోకాలు చదివి వాటిని వివరించి భగవంతుని పూజ జరిపేవారు. అలాగే హిందువులే కాక ఇతర దేశస్థులుకూడా బ్రహ్మ సమాజానికి వచ్చి అక్కడ తమ తమ భాషల్లో దైవస్తుతి కావించేవారు."

1906లో రాయ్ మరణించిన డెబ్బదేండ్లకు కలకత్తా ఆస్తిక సభలకు అధ్యక్షత వహించిన ఆంధ్రుడు బ్రహ్మర్షి వెంకటరత్నం నాయుడు ఇల్లా పేర్కొన్నాడు-

"శాశ్వతమయిన ఈ ధర్మశాసనం-బ్రహ్మసమాజం ఆశయాన్ని చక్కగా వివరించింది. ఇది భగవంతుని పూజించదలచుకున్న వారికందరికీ ఎటువంటి పక్షపాత ధోరణి లేని కేంద్రంగా వుండాలని ఆశించబడింది. మత భేద దృష్టి కానీ, మతద్వేష దృక్పథంకానీ లేకుండా ఒక మనిషి మరో మనిషితో స్నేహ భావాన్ని పెంపొందించుకోవడానికీ, నైతిక దృష్టి-దయాదాక్షిణ్యాలు వంటి సుగుణాలను ప్రోత్సహించడానికీ ఈ బ్రహ్మసమాజం ఉద్దేశింప బడింది"

పదిహేనేళ్ళపాటు వేదాంత సిద్ధాంత ప్రబోధం కావించిన ఘనత బ్రహ్మ సభది. బ్రహ్మసమాజం అనే పేరుకూడా రాయ్ చివరిదశలో వాడాడు. ఆ పేరు వ్యాప్తి అయింది ఆయన తర్వాతనే.

1841లో బ్రహ్మ మతం పేర శాస్త్ర అంశాలను క్రోడీకరించి పుస్తకముగా ప్రచురించాడు మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు.

రాయ్ తర్వాత యేబదేండ్లకు వేదాంతమతం,బ్రహ్మధర్మంగా ఆంగ్లేయ ప్రముఖులతో పేర్కొనబడింది.

రాయ్ భారతదేశం విడిచి ఇంగ్లాండు పోగానే ఆయన విశాలదృష్టి 'బ్రహ్మ సభ'లో చెదరిపోయింది. ఆయన మరణం (1833)తో పూర్తిగా కరగిపోయింది. ఆ స్థానం హిందూ ఏకేశ్వరోపాసకుల సంఘం ఆక్రమించింది. బ్రహ్మ సమాజం పేరు రూఢి అయింది. బ్రహ్మ మతం వ్యాప్తిచెందింది.

అయినా రాయ్ విశాల దృక్పథం మరపునకు రానిది.

## వచన రచనా పితామహుడు

ఇప్పటికి 200 ఏండ్లక్రితం బెంగాళీ భాషలో చెప్పుకో దగినదంటూ వచన రచన ఏదీ వ్యాప్తిలో లేదు. హిందీ తర్వాత భారత దేశంలో బెంగాళీలది రెండవ స్థానం. అందులో తూర్పు బెంగాళ్ చీలి బాంగ్లాదేశ్‌గా రూపొందిన తర్వాత కేవలం పశ్చిమ బెంగాళ్ ఇండియాలో చేరి వున్నందున భాషాపరమయిన జన సంఖ్యలో మన తెలుగువారిది ద్వితీయ స్థానమైంది బెంగాళీలది మూడవ స్థానం.

మనకు అయిదారు వందల ఏండ్లక్రితమే కృష్ణమాచార్య "సింహగిరి

వచనములు", తాళ్ళపాక పెద తిరుమలా చార్యుని "శ్రీ వెంకటేశ్వర వచనములు" లభిస్తున్నవి.

బెంగాళీలో పందొమ్మిదవ శతాబ్ది ఆరంభం వరకు స్థిరమైన వంగ భాషా వచన రచనలు లేవు. ఉన్నవయినా సంస్కృతంలోనే నిండి వుండేవి. కవిత లోనే చూడండి. రవీంద్రుని రచన మన జాతీయగీతంలో జయహే, గాహే, జాగే వంటి మూడు నాలుగు పదాలు తప్ప మిగతాదంతా సంస్కృతమయమే!

వంగ భాష వచనానికి ప్రోత్సాహం కల్పించినవారు సెరంపూరు క్రైస్తవ బోధకులు. గౌతమబుద్ధుడు తన బౌద్ధమత ప్రచారానికి పండిత జన సమ్మాన్యతలో ఉన్న సంస్కృతాన్ని వదలి, సామాన్య జన వ్యవహారంలో వున్న పాలీ భాషను స్వీకరించినట్లే వీరు సైతం సంస్కృత ఆంగ్లాలను మించి దేశీయభాషకు విలువిచ్చారు.

రాజకీయ రంగంలోనూ ప్రజా సంబంధంకోసం దేశ వ్యవహార భాషలను ప్రోత్సహించారు. అధికారులూ అవి నేర్చుకున్నారు.

1778లో హాల్‌హెడ్ అనే విదేశీయునితో తొలి "వంగభాషా వ్యాకరణం" వ్రాయబడింది.

1801లో కేరీ మరో వ్యాకరణ పుస్తకం వ్రాసాడు. అవి ఆంగ్లేయులు వంగభాష నేర్వడానికి ఉద్దేశింపబడినవి. బెంగాళీలకు వారి మాతృభాషలో వెలువడిన మొదటి వ్యాకరణ పుస్తకం రామ్మోహన్‌రాయ్ చేతిచలవ వల్లనే. 1833లో కలకత్తా పాఠ్యపుస్తక సంస్థ దాన్ని ప్రచురించింది. 68 విషయాలతో కూడిన 11

అధ్యాయాలు అందులో వున్నాయి. వాక్య నిర్మాణం గురించే కాక ఛందస్సు గురించీ అందులో ఆయన చర్చించాడు.

1801,2ల్లో బెంగాళీలో వచన గ్రంథాలు వెలువడినా అవి వాచకాలు. సంస్కృత పదాలు జాస్తి.

1815లోని రామ్మోహన్ "వేదాంత గ్రంథం" వాచకం కాదు, అనువాదం కాదు, వంగ భాషలో మూల రచన. దానిలో దేశీయత వుంది. సంస్కృత పదాడంబరం లేదు. చేంతాడు పొడుగు సమాసాలూ లేవు. చెప్పడానికి భావం దొరుకనప్పుడు శబ్దాడంబరం ముందుకు వస్తుంది.

గాలిబ్ లేఖలు ఆధునిక ఉర్దూకు, మావో వ్యాసాలు నవీన చీనాభాషకు ప్రామాణికాలవుతాయని వారు భావించలేదు-కాని, అయినై. రాయ్ మాత్రం తన వచనం రాబోవు తరానికి మార్గదర్శకం అవుతుందనే ఊహించే రూపొందించాడు. అందుకు నిదర్శనం ఆతని తొలి పుస్తక పీఠికలో వాక్య నిర్మాణ విషయాలను గూర్చి వివరించడమే.

ఆ పద్ధతి తర్వాతి వచన రచయితలు ముఖ్యంగా నవలా రచయితలు బంకిం, రవీంద్ర, శరత్ అనుసరించి వంగభాషను సుసంపన్నంచేసి అఖిలభారతం లోనే కాదు ప్రపంచ స్థాయిలో గౌరవం పొందారు. ఆ ఘనత రాయ్‌ది.

## ధ్రుపద్ గీత రచయిత

ఒక విద్వాంసుడు, మేధావి, సంఘ సంస్కర్త, రచయిత, అంత మాత్రమేనా? ఆయన కవి-వాగ్గేయకారుడు కూడా!

రామ్మోహన్ ముందు బెంగాళీలో పాటలు-టుప్పమీ, టప్పా, కీర్తన అనేవి ప్రచారంలో వుండేవి. బౌల్, సారి, జారి మొదలయిన జానపద గేయ రూపాలుండేవి.

"ద్రుపద్" గీతాలను రాయ్ స్వయంగా రచించి, సంగీతం కూర్చి బ్రహ్మసభ సమావేశాల్లో పాడాడు-పాడించాడు. అంతకుముందు ద్రుపద్‌లు హిందీ భాషలో వుండేవి. వంగ భాషలోనికి ఆ గేయరూపాలను తెచ్చి 32 గీతాలు వ్రాసాడు రాయ్. ఆ తర్వాత అదే మార్గంలో అదే ప్రయోజనం కోసం అనేక ద్రుపద్ గీతాల రచింపజేసిన ఘనత దేవేంద్రనాథ ఠాకూర్‌ది.



భావ గాంభీర్యం వున్నా సంగీతాడంబరం లేక సులభంగా పాడుకోవ డానికి వీలయిన ఆ గీతాలను రాయ్ 1828లో రచించాడు.

# రాజకీయ సంస్కరణ

"ప్రస్తుతం హిందువులు అనుసరిస్తున్న మత విధానం వారి రాజకీయ వ్యవహారాలను మెరుగుపరచుకోవడానికి వీలుకలిగించడం లేదని నేను విచారిస్తు న్నాను. కులాల భేదాలు, ఒక్కొక్క కులంలోనూ అనేక విభాగాలూ వుండడం హిందువులకు బొత్తిగా రాజకీయ భావమే లేకుండా జేసింది. లెక్కలేనన్ని మత కర్మకాండలు, ప్రాయశ్చిత్త సూత్రాలు, హిందువులను కష్టమయిన కార్యక్రమం దేన్నీ స్వీకరించడానికి అనర్హులను చేశాయి. అందువల్ల వారి రాజకీయ అభివృద్ధి సాంఘిక చైతన్యం కోసమయినా వాళ్ళ మతంలో కొన్ని మార్పులు రావడం అవసరం" 1828.

హిందూ మతాన్ని మా, మన, అనకుండా వాళ్ళ మతం అనడం రాయ్ మతాతీత దృక్పధానికి నిదర్శనం. మత సంస్కరణ జరగందే సాంఘిక-రాజకీయ అభివృద్ధి సాధ్యం కాదని అయన భావించాడు.

కులాలు-మతాలు మనలో చీలికలు కల్పించి సమైక్యతను భంగపరుస్తు న్నాయని; జాతీయ మానవతావాద దృష్టి రూపొందాలని తలచాడు. ఆ సమతను ప్రబోధించడం ఆ కాలంలో గొప్ప సాహసిక ఘనకార్యం అనాలి, రాజకీయ సంస్కరణల్లో ప్రధానంగా న్యాయ పరిపాలనను, పత్రికా స్వాతంత్ర్యాన్ని కోరాడు

న్యాయ వ్యవస్థలో జ్యూరి విధానాన్ని అభినందించాడు. చిన్న కేసుల్లోనే

కాక పెద్ద వ్యాజ్యాల్లోనూ భారత జ్యూరీలను (జడ్జికాక వేరుగావుండే స్థానిక ప్రముఖులు) అంగీకరించాలని కోరాడు. ఇవన్నీ పెద్దవాళ్ళకు విద్యావంతులకు అర్థమయ్యేవిలెండి.

ఆర్థిక విషయాల్లో మార్పును అభిలషించడం గొప్ప విషయం. నాటి జమిందారీ వ్యవస్థ దోపిడీలో రైతులు ఎలా బాధపడుతున్నది కళ్ళారాచూసి వ్యధ చెందాడు రామ్మోహన్. దేశానికి అన్నదాతలయిన వ్యవసాయదారులు కూటికి మొగం వాచి దారిద్ర్యంతో మునిగివుండడం దేశానికి మేలుకాదని తలంచాడు. వారి పరిస్థితి మెరుగుపడందే దేశ ప్రజల స్థితి బాగుకాదని భావించాడు.



1832లో పార్లమెంటరీ కమిటీ ముందు ఇలా సాక్ష్యం చెప్పాడు కరుణామయుడు.

"రైతుల పరిస్థితి చాల హీనంగావుంది. జమీందారుల దురాశాలోభాలకు వారు బలిఅయ్యే స్థితిలో వున్నారు. భూస్వాముల ఆదాయాన్ని విలువ కట్టడంలో ప్రభుత్వం జాలి ప్రదర్శిస్తున్నది. బీద రైతులమీద ఆ దయను ఏమాత్రమూ చూపించడం లేదు."

1793 నాటి శాశ్వత కౌలుదారీ చట్టంవల్ల జమీందార్లు ఎక్కువ లాభ పడింది, పేద రైతులు మరీ దిగజారి పోయారనీ ఆయన గుర్తించాడు. కౌలు ఎక్కువగా వుండటంవల్ల రైతు చెమటోడ్చి శ్రమించి పండించిన పంటంతా కౌలు చెల్లింపుకే అయిపోయి మిగులు ధాన్యం అంటూ వుండని దయనీయ పరిస్థితికి లోనయ్యారు వాళ్ళు. జమీందార్లు ఆంగ్లప్రభుత్వం నుండి గుత్తాకు భూముల్ని తీసుకొని విపరీతమైన కౌలుపెంచి రైతులకు సాగుచేయడానికి ఇచ్చి లాభం పొందే వారు.

ఈ విధానాన్ని వ్యతిరేకించి కౌలు రేటును తగ్గించవల్సిందిగా ప్రభు త్వాన్ని కోరాడు. అలా ఉదారం చూపడం వల్ల వచ్చిన నష్టాన్ని ధనికులువాడే విలాస వస్తువులమీద పన్నులు ఎక్కువవేసి రాబట్టుకోవచ్చు నన్నాడు. ఇంకా ఎక్కువ మొత్తాల్లో జీతాలు తీసుకునే ఆంగ్ల అధికారుల స్థానంలో తక్కువ జీతా లకు పనిచేసే భారతీయ ఉద్యోగులను కలెక్టర్లను నియమించి డబ్బు ఆదా చేసుకో వచ్చునని సూచించాడు.

రైతులు తాము పండించిన దినుసులు కూరగాయలు అమ్మడానికి

మార్కెట్లకు వచ్చేటప్పుడు జమీందార్లు నిర్దయగా పన్నులు వసూలు చేయటాన్ని రద్దుచేయాలని కోరాడు.

అప్పుడు బ్రిటిష్ కంపెనీ ఉద్యోగులు ఉప్పు వ్యాపారాన్ని కాంట్రాక్టుకు తీసుకొని, దాని ధరను మామూలు ఉత్పత్తి ధరకంటె వెయ్యింతలు పెంచి అమ్మి లాభపడేవారు. సముద్రపు నీరు ఎండితే సులభంగా చౌకగా లభించే ఉప్పుపై ఆంక్షలు విధించి సామాన్య జనాన్ని నష్టానికి గురిచేసే ప్రభుత్వ విధానాన్ని వ్యతిరేకించాడు. ఉప్పు తయారీకి పనిచేసే శ్రామికులు బానిస జీవితాలీడ్చేవారు. పైగా ధర పెంచినా ఉప్పుకల్తీ చేసేవారు. ఇతర దేశాలనుండి వచ్చే ఉప్పు రాకుండా వుండాలని విపరీతంగా సుంకాలు వేసారు.

ఇవన్నీ ప్రభుత్వం దృష్టికి తెచ్చాడు రాయ్ ఉప్పుధర దించాలని, కార్మికుల జీతాలు పెంచాలని, సుంకం తగ్గించి ఇంగ్లాండునుంచి స్వచ్ఛమైన ఉప్పు తెప్పించుకోవాలనీ కోరాడు రాయ్.

మరో వందేండ్లకు 1930లో గాంధీజీ సాగించిన 'ఉప్పు సత్యాగ్రహం' దండియాత్రను బట్టి ఇది ఎంత ప్రధాన సమస్యో అర్థం చేసుకోవచ్చు. రాయ్ కృషివల్ల ఉప్పు గుత్తవ్యాపార విధానాన్ని రద్దుచేసింది పార్లమెంటరీ బోర్డు.

ఇలా ఎన్నో రంగాల్లో సమాజ ప్రయోజనంకోసం సంస్కరణాత్మకమైన మార్పులకోసం పోరాడిన ధర్మవీరుడు రామ్మోహన్‌రాయ్.

## ఆంగ్లేయుల దోపిడీని వ్యతిరేకించాడు

ఈ దేశ సంపదలను దోచి తమ దేశానికి తరలించడానికే ఆంగ్ల ప్రభుత్వం ఏర్పడిందనే సత్యాన్ని మొట్టమొదట గుర్తించినవాడు రామ్మోహన్.

ఆంగ్లేయులకంటే దాడాపు వెయ్యేండ్ల ముందుగా ఘోరీ, గజినీవంటి అరబ్బు రాజులు ఆదేపని చేశారు. భారతదేశాన్ని దోచడానికే వాళ్ళు దండ యాత్రలు చేశారు. అపారధన రాశితో తిరిగి వెళ్ళారు. కాని ఆ తర్వాత వచ్చిన ముస్లిం పాలకులు ఇక్కడే స్థిరపడ్డారు. స్వార్ధ సుఖాలకోసం వీళ్ళు దేశ ప్రజలను దోచినా విలాసాలకు విచ్చలవిడిగా వెచ్చించినా దేశసంపద సరిహద్దులను దాటి పోలేదు.

ఆంగ్లేయులలా కాదు. డచ్చి, ఫ్రెంచి, పోర్చుగీసు ఇతర యూరోపియనులవలె వీళ్ళు దోపిడీ కోసమే కూటనీతితో పాలకులైనారు. బేరగాళ్ళుగా ఇక్కడ చేరారు. దయలేదు. దేశీయుల గోడు వినిపించుకోరు. కసాయివాడు గొర్రెపిల్ల అరపులకు జాలిపడని విధానమే వీరిది సైతం.

భారతదేశ ఆదాయ వ్యయాలమీద సమగ్రమైన పరిశీలన జరిపాడు రాయ్ ఇక్కడి ఉద్యోగస్తులకంటే విదేశీయుల జీతాలు ఎన్నోరెట్లు ఎక్కువ. వున్నత పదవులందు అందరూ వాళ్ళే, ఇక్కడ వున్నంత కాలముండి ఉద్యోగాల విరమణ తర్వాత పెద్ద మొత్తాలతో తమదేశం వెళ్ళేవారు. ఇలా దేశ సంపద కొల్లగొట్ట బడుతున్నదని పట్టికల సాక్ష్యం చూపి నిరూపించాడు.

1830 ఫిబ్రవరిలో రాయ్ చూపిన లెక్క, భారతదేశంనుండి ఇంగ్లాండుకు ప్రాంతాల ఖర్చుల లెక్కక్రింద ఏటా 30 లక్షల పౌండ్లు, ఇంకా స్థానిక గిడ్డంగులకోసం నాలుగున్నర లక్షలు వ్యయం చేస్తున్నారు ఆంగ్లేయులు.

బెంగాళ్‌లోని ఒక ఉన్నతోద్యోగి ప్రభుత్వానికి 1810 జూన్‌లో వ్రాసిన ఉత్తరంలో ఈ క్రింది వివరాలిచ్చాడు.

"ప్రత్యేక వ్యక్తులకోసం ప్రతియేటా లండన్‌కు పంపుతున్న మొత్తం ఈ మధ్య కొన్నేళ్ళనుంచి దాదాపు 20 లక్షలుంటుందని చెప్పవచ్చు. ఇందులో అతిశయోక్తి ఏమీలేదు... భారతదేశం 1765-1820 మధ్య ఏదో ఓ రూపంలో వసూలు చేసిన మొత్తం కనీసం నూరుకోట్ల పౌండ్లు వుండవచ్చును."

ఇంగ్లాండు స్వతంత్ర వ్యాపారులకు, గుత్తాబేపార్లకు జరిగిన పోటీలో రాయ్ స్వతంత్రుల పక్షం వహించాడు.

ముస్లిం పాలన చివరిలోని ఆర్థిక మాంద్యాన్ని ఆంగ్ల పరిపాలన తొలగిస్తుందని ఆయన భావించాడు. సముద్ర ప్రయాణాన్ని కూడా నిషేధించి భారత దేశం ప్రపంచానికి దూరంగా ప్రత్యేకంగా వుండాలనుకుంది. అయినా విదేశీ దండ యాత్రలవల్ల అలా వుండలేక పోయింది-ఓడింది. కొన్నేండ్ల పాటు దాస్యాన్ని అనుభవించింది.

స్వార్థ ప్రయోజనం కోసమైనా ప్రపంచ శక్తి ప్రవాహంలో ఇండియాను పడవేసిన పుణ్యం ఆంగ్లేయులది. లేకుంటే మరి ఎన్నాళ్ళకు మనవాళ్ళు మడి విడిచి ప్రపంచంవైపు దృష్టిసారించే వాళ్ళో.

బెంగాల్లో ఆంగ్లేయులు పరిశ్రమలు స్థాపించడాన్ని రాయ్,ద్వారకానాథ్ మిక్కిలి ప్రోత్సహించారు. దోపిడీ పెరుగుతుందనే విషయం అటుంచితే ఇలాగైనా దేశంలో పారిశ్రామికీకరణ జరుగుతుందని, జమీందార్ల దోపిడీనుండి తప్పుకొని శ్రామికులు ఫ్యాక్టరీ కార్మికులుగా మెరుగ్గా జీవిస్తారని వారు ఆశించారు. గుడ్డికంటె మెల్ల మేలుకదా!

ఇప్పుడు వ్యవసాయ కూలీలకంటె ఫ్యాక్టరీ ఉద్యోగుల గని కార్మికుల

జీవన పరిస్థితులు బాగుపడటం ప్రత్యక్షంగా చూస్తున్నాం కదా. పిండికొలది రొట్టె. ఆదాయాన్ని బట్టి సౌకర్యాలు.

## స్త్రీలకు ఆస్తి హక్కు కోరాడు

స్త్రీలకు పురుషులతో సమానంగా ఆస్తిహక్కు వుండాలనే వాదం ఈ నాటిది కాదు. అందుకు తీవ్రంగా శ్రమించి 'హిందూకోడ్' నిర్మించి పార్లమెంట్‌లో పాస్‌కాక తన న్యాయశాఖామంత్రి పదవికి రాజీనామా ఇచ్చాడు బి. ఆర్. అంబేద్కర్. స్వతంత్ర భారతంలో సాంప్రదాయక స్వార్థభావాలు ఇంకా అంత బలంగా వున్నాయి.

ముస్లిం స్త్రీలకు భర్త ఆస్తిలో భాగంలేదు విడిపోతే. విడాకులు పొందిన స్త్రీ ఈమధ్య మాసిక భృతికోసం కోరితే, ఆమె భర్త నెలకు ఇంత మొత్తం ఇవ్వాలని సుప్రింకోర్టు తీర్పు చెప్పింది. 'ఇది మా మతాచారం కాదు, అలా ఇవ్వడం న్యాయం కాదని, దేశమంతటా ముస్లింలు పెద్ద సంఖ్యలో ప్రదర్శనలు జరిపారు. అదీ-మన మతాలు-మగవాళ్ళు ఆడవాళ్ళకు చేసే న్యాయం.

రాయ్ ఈ విషయంలో తీవ్ర పరిశోధన చేసి స్త్రీలకు పురుషులతో సమానంగా ఆస్తిహక్కు వుండాలని వాదించాడు. పూర్వ శాస్త్రాలనుంచి ఆధారాలు చూపాడు. సత్యాంశానికి శాస్త్రాధారాలు ఎందుకంటే, అది నీరే అయినా శంఖులో పోస్తేకదా తీర్థం అయ్యేది. అదేదో క్రొత్తభావం కాదు ప్రళయం రాదు, ఇదీ ప్రాచీన సిద్ధాంతమే అంటే మన పెద్దలకు తృప్తి. వీరిలో అనేకులకి "గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్" అనే విశ్వాసం.

పురాతన ధర్మశాస్త్రాలన్నీ ఇంచుమించుగా స్త్రీకి కుటుంబ ఆస్తిలో భాగం కల్పించాయి. మాతృస్వామ్య వ్యవస్థలోనైతే స్త్రీయే ఆస్తికి అధికారిణి. పురుషుల ఆధిపత్యం ఆరంభమై మగవానికి ఆస్తిపై అధికారం వచ్చి, అతని తర్వాత కుమారులకే అది పంపకం కాసాగింది.

రామ్మోహన్ ఈ విషయంలో చూపిన శాస్త్ర వివరాలు చూడండి. యాజ్ఞ్యవల్క్యుడు తండ్రి చనిపోయిన తర్వాత, ఆ తల్లి తన కొడుకులతో సమానంగా (భర్త వదలి వెళ్ళిన) ఆస్తిని పంచుకొనవచ్చును.

కాత్యాయనుడు—

మాతాచ పితరి ప్రేతే పుత్ర తుల్యాంశ హారిణీ.

(తండ్రి మరణిస్తే తల్లికి పుత్రులతో సమానమైన ఆస్తి భాగం వస్తుంది.)

నారదుడు—

సమాంశ హారిణీ మాతా పుత్రాణాం స్యాన్మృతే పతౌ.

(భర్త చనిపోతే స్త్రీకి తన పుత్రులతో సమానమైన ఆస్తి హక్కు వుంటుంది.)

విష్ణుముని—

కొడుకునకు అంగీకరింపబడిన సమాన సంపద భాగాన్ని తల్లి పొందగలదు.

బృహస్పతి—

తదభావేతు జననౌ తనయాంశ సమాంశినీ

సమాంశా మాతర స్త్వేషాం తురీయాంశాస్తు కన్యకా.

(యజమాని మరణిస్తే ఆ తల్లికి కుమారులతో సమాన ఆస్తి భాగం వస్తుంది. సవతి తల్లికీ అంతే. కన్యలకు సోదరుల భాగంలో నాలుగవ వంతు చెందుతుంది.)

వ్యాసుడు—

అసుతాస్తు పితుః పత్న్యః సమానాంశా ప్రకీర్తితాః

పితామహ్యశ్చ తాః సర్వా మాతృతుల్యాః ప్రకీర్తితాః

(పిల్లలులేని స్త్రీలు తమ సవతి పిల్లలతో సమానమైన భాగాన్ని కల్గి వుంటారు. తాతమ్మలు తల్లుల వలెనే ఆస్తికి హక్కుదారులు)

దాదాపు పూర్వ ధర్మశాస్త్ర కారులందరూ కన్యలకు, సోదరులు తమ భాగంనుంచి ప్రతివారూ నాలుగవవంతు ఇవ్వాలని సూచించారు.

ఈః కాలంలో వరకట్నాల కారణంగా స్త్రీలకు వేరే ఆస్తి ఇవ్వబడుతూ లేదు. లోభత్వం వల్ల తల్లిపోషణ భరిస్తామంటూ వేరే ఆస్తి భాగం ఇవ్వటం లేదు.

అనేక కారణాలుగా శాస్త్రకారులు బ్రాహ్మణులకు బహు భార్యలను కలిగి వుండడానికి అనుమతించారు. చెడ్డవారైన సతులను వదిలివేయ లన్నారు. చెడువారైన పతులను మాత్రం దైవంగా సేవించాలన్నాడు మనువు స్మృతికర్త.

ధనాశకు (నేటి అరబ్బులకు ముస్లిం యువతులను ఇచ్చి పెళ్ళిల్లు చేసి

నట్లు) నాటి బ్రాహ్మణులు వృద్ధులకు చిన్న వయస్సుగల కూతుళ్ళనిచ్చి వివాహాలు చేసేవారు. కొద్ది కాలానికే విధవలయిన ఆ స్త్రీలగతి ఘోరంగా వుండేది.

ఈ కన్యాశుల్కాన్ని రాయ్ వ్యతిరేకించాడు. పైగా ఆడంగులగు తండ్రి - భర్త ఆస్తుల హక్కులకోసం పోరాడినాడు.

## సతీ సహగమనం

ఇన్ని సంస్కరణల్లో రాయ్‌కు అమితఖ్యాతి తెచ్చింది సతీసహగమన దురాచారానికి వ్యతిరేకంగా పోరాడటం.

భారతదేశంలో అదీ బెంగాళీ బ్రాహ్మణులలో ఇది ఆచరింప బడుతుండేది. క్షత్రియుల్లోనూ కొంతవరకు ఈ ఆచారం వుంది.

మరణించిన భర్తతోపాటు భార్య సజీవంగా చితిమంటల్లో పడి కాలి చావడం 'సతీ' పవిత్ర ధర్మం. దీన్ని కొందరు శాస్త్రకారులు గొప్ప పుణ్యకార్యంగా అభివర్ణించారు. చాదస్త పండితులు స్త్రీల బ్రతుకులను బుగ్గిపాలు చేశారు.

భారతంలో పాండురాజు భార్యమాద్రి, రామాయణంలో ఇంద్రజిత్తు భార్య సులోచన తప్ప మరెవరూ దీనిని ఆచరించినట్లు లేదు. మృచ్ఛకటికం నాటకంలో చారుదత్తుని భార్య ధూతాంబపతి మరణవార్త విని అగ్నిప్రవేశం చేయబోయినట్లుంది.

వసుదేవుడు యోగంతో శరీరం వదలగా ఆయన భార్యలైన దేవకి, రోహిణి, భద్ర, మదిరలు చితిలోపడి మరణించినట్లు సంస్కృత భారత మౌసల పర్వంలో వుంది.

రుక్మిణి, గాంధారి, శైబ్య, హైమవతి, జాంబవతి అను శ్రీకృష్ణుని భార్యలు భర్త శవంతో సహగమనం చేశారని భారతంలో వుంది. భాగవతంలో కృష్ణుని భార్యల పేర్లు కొన్ని వేరుగా వున్నవి. సత్యభామ మొదలైనవారు తపస్సు కోసం వనాలకు వెళ్ళారట.

వృద్ధాప్యంలో ధృతరాష్ట్రుడు దావాగ్నిలో పడగా అతనివెంట భార్య గాంధారి తమ్ముని భార్య కుంతికూడా అగ్నిలోపడినారు. ఈ విషయాలు మాద్రి సహగమనం వలె అంతగా జనవ్యాప్తిలో లేవు.

పలనాటి యుద్ధం సినిమాలో నలగామరాజు కూతురు పేరిందేవి భర్త అలరాజు శవంతో సహగమనం చేసినట్లుంది. బాల సన్యాసమ్మకథ సహగమనపుదే. వరంగల్లు సారక్క సమ్మక్క జాత్ర 'సతీ'దేనట.

ప్రస్తుతం నూతన దైవంగా ప్రచారం పొందుతున్న అయ్యప్ప(కేరళ) బ్రాహ్మణ యువకుని మృతిలో ఆయన ఆటవిక భార్యలిద్దరూ సహగమనం చేసినట్లు ఒక తమిళ ప్రొఫెసర్ (త్రివేంద్రం) చెప్పగా మైసూరులో విన్నాను.

విరాట పర్వంలో సింహబలుని శవంతో ద్రౌపదిని కట్టివేయనెంచారు. ఈమె ప్రేమలో మరణించిన అతనితోపాటు ఈమెను అంతం చేయాలని.

ఈ సతీసహగమనానికి కారణమేమిటి? పతిహీనలైన పడతులు తమ నిస్సహాయతకు దుఃఖానికి తట్టుకోలేక మొదటి దినాల్లో మరణించేవారేమో-భక్త తుకారం పైలోకగమనంతో భార్య మరణించినట్లుగా.

లైలా మజ్నూ, అనార్కలి సలీం రోమియో జూలియెట్‌వంటి ప్రేమ కథలు మరోరకం. క్షత్రియరాజులు యుద్ధాల్లో మరణించిన వార్త విని రాణివాస

స్త్రీలు ఖడ్గాలకు బలికావడమో అగ్నికి ఆహుతి కావడమో చేసేవారు. బొబ్బిలి యుద్ధంలోని ఈ సన్నివేశం మీరు చూసేవుంటారు.

ఇది ఒక ఆచారంగా ఎందుకు మారింది? విధవలకు స్మృతికారు లెందరో భర్త ఆస్తిలో సంతానంతోపాటు ఆస్తిహక్కు కూడా కల్పించారు. సహగమనం తప్పనిసరి అయితే ఆస్తిహక్కు ప్రస్తావన వచ్చేది కాదుకదా.

ఈ విషయంలో శాస్త్రాలు ఏం చెప్పాయో చూద్దాం—

## శాస్త్రాల ఆధారం

అంగిరసుడు ముఖ్యంగా సతీసహగమనాన్ని బలపరిచాడు.

శ్లో॥ మృతే భర్తరి యానారీ సమారోహేత్ హుతాశనమ్
స్సారుంధతీ సమాచారా స్వర్గలోకే మహీయతే॥

(భర్త శవంతోపాటు అగ్నిప్రవేశం చేసిన స్త్రీ స్వర్గలోకం ప్రవేశించి అరుంధతి నక్షత్రంవలె ప్రకాశిస్తుంది.)

భారతంలో ఒక ఆడపావురం, మగపావురం చావుకు మరణించగా ఆ సందర్భంలో వ్యాసుడు వ్రాసాడిలా—

"భర్త మరణించగా అగ్నికి ఆహుతి అయిన ఆడపావురం వెళ్ళి భర్తను కలుసుకుంది." ఇంకా ఇలా అన్నాడు.

శ్లో॥ తిస్రకోట్యర్థ కోటీచ యానిలోమాని మానవే
తావత్స్యబ్దాని సా స్వర్గే భర్తారాం యాను గచ్ఛతి॥

(భర్తతో సహగమనం చేసిన స్త్రీ భర్తతో పాటుగా, మానవ శరీరంపై ఎన్ని రోమాలున్నాయో అన్నేండ్లు, మూడున్నరకోట్ల సంవత్సరాలు స్వర్గలోక ఆనందం అనుభవిస్తుంది.)

బ్రహ్మాండ పురాణంలో :

"భర్త పరదేశంలో మరణిస్తే పతివ్రతయైన భార్య భర్త చితా భస్మాన్ని ఛాతిపై వుంచుకొని పవిత్రంగా అగ్నిప్రవేశం చేయాలి" అని వుంది.

విష్ణుముని మాటల్లో :

"మృతే భర్తరి బ్రహ్మచర్యం తదారోహణం వా"

(భర్తతోపాటు అగ్నిలో పడాలి-లేదా బ్రహ్మచర్య దీక్షతో జీవించాలి) ఇక్కడ నియమం కొంత సడలించబడింది.

స్కంధ పురాణంలో ఇలాగుంది :

శ్లో॥ అనుయాతి న భర్తారం యది దైవాత్ కదంచన
తదాపి శీలం సంరక్ష్యం శీలభంగాత్ పతత్యధః॥

(భర్తతో మరణించే వీలు చిక్కకపోతే ఆమె శీలాన్ని పరిరక్షించుకోవాలి. శీలం కోల్పోతే నరకంలో పడిపోతుంది.)

'మితాక్షరి' రచయిత విజ్ఞానేశ్వరుని భావాల్లో-

"శాశ్వత మోక్షం కాక, అల్పకాలిక స్వర్గసుఖాలను కోరే స్త్రీ మాత్రమే సతిని ఆచరిస్తుంది"

హారితుడు :

"నాన్యోహి ధర్మో విజ్ఞేయో మృతే భర్తరి కర్హిచిత్"
"నాన్యోహి ధర్మ ఇతితు సహమరణస్తుత్యర్థ"-
అని అంగిరసుని సిద్ధాంతాన్ని బలపరిచాడు.

రుగ్వేదంలో :

"ఓ అగ్నిదేవా! ఈ తరుణులు స్వచ్ఛమయిన వెన్నతో అభిషిక్తమైన శరీరాలతో, బలంలేని కన్నీళ్ళతో కూడిన కాటుక కళ్ళతో నిన్ను చేరుతున్నారు. ఓ జలాధి దేవతా-వీరు తమ భర్తలతో వేరు చేయబడకుందురు గాక. చక్కనయిన తమ భర్తల సాన్నిహిత్యము పొందుదురు గాక. వీరు నిష్పాపులు. స్త్రీలలో మణిపూసలు"

ఇలా అంగిరసుడు, హారీతుడు, విష్ణు, వ్యాసుడు...సతీ సహగమనాన్ని అంగీకరించారు. వీరిలో కొందరు అగ్నిప్రవేశానికి బదులు బ్రహ్మచర్య నిష్ఠతో వితంతువులు బ్రతకాలన్నారు.

మనువు, యాజ్ఞ్యవల్క్యుడు, వశిష్టుడు కేవలం బ్రహ్మచర్యాన్ని ఆమోదించారు.

మనుస్మృతి : (అధ్యాయం-5, శ్లోకం-158)

ఆసీతా మరణాత్ క్షాంతా నియతా బ్రహ్మచారిణీ
యో ధర్మ ఏకపత్నీనాం కాంక్షంతీ తమనుత్తమమ్॥
చచ్చేవరకు నియమబద్ధంగా జీవించాలన్నాడు.

యాజ్ఞ్యవల్క్యుడు :

వితంతువు తన పుట్టింటివారి,లేదా అత్తింటివారి రక్షణలో వుండాలి.కాని స్వతంత్రంగా వుండకూడదు-అన్నాడు.

భగవద్గీత : బ్రహ్మచర్యాన్ని, నిష్కామకర్మను బోధించింది.

## స్వర్గ కాంక్ష దీనికి కారణమా ?

స్వర్గకామో ఽ శ్వ మేధేన యజేత—స్వర్గాన్ని కోరేవాడు అశ్వ మేధాన్ని చేస్తాడు. అలాగే ఇది.

స్వర్గసుఖాలు అల్పమయినవి. తిరిగి జన్మలకు కారణమయినవిగా భావించి, పునర్జన్మలేని మోక్షం కోసం నిష్కామంగా తపస్సు చేసేవారు మహనీయు లని అనేక పురాణ శాస్త్రాల్లో వుంది.

సతీసహగమనం సకామకర్మ. ఒక యజ్ఞం లాంటిది.

మరి దీని ఆచరణకు కారణమేమిటి?

మనువు దీనిని అంగీకరించలేదు. మనుస్మృతి చెప్పినదానికి విరుద్ధంగా ఉన్న అంశం అంగీకారయోగ్యం కాదు అని బృహస్పతి అన్నాడు.

"య ద్వైకించిన్మనురవదత్ తద్భేషజం"—యజుర్వేదం.

శాస్త్రాల పరస్పర భేద అంశాల న్యాయాన్యాయ నిర్ణయ సందర్భంలో మనుస్మృతే ప్రమాణమని వేదశాసనం. మరి మనువు ఒప్పనిది సతి.

## శాస్త్ర వ్యాఖ్యాతల ఘనకార్యం

స్మార్త భట్టాచార్య (రఘునందన-బెంగాళీ నవీన శాస్త్ర వ్యాఖ్యాత) అంగిరసుని సిద్ధాంతాన్నే బలపరిచాడిలా—

"సహగమనం వినా వేరే ధర్మనిష్ఠ విధవలకు లేదు."

ఈ విషయాన్ని గూర్చి పురాతన హిందూ ధర్మశాస్త్రాలనే కాక అన్య మత ధర్మాలను, ఆచారాలనుగూర్చి చక్కగా పరిశీలించాడు రామ్మోహన్.

స్త్రీల జీవిత స్థితిగతులను అధ్యయనం చేశాడు. శారీరకంగా పురుషుడి కన్న సుకుమారంగా కాస్త దుర్బలంగా వుంటారు ఆడవాళ్ళు. అయినా వాళ్ళు పురుషులకన్నా ఎంతో ఎక్కువగా శ్రమిస్తున్నారు. పురుషులకు ఎన్నో విధాల సేవ చేస్తున్నారు. అయినా యెన్నో కఠిన నిబంధనల క్రింద నలిగిపోతూ హీనంగా చూడ బడుతున్నారనేది గమనించాడు.

## స్త్రీల సామాజిక పరిస్థితి

అందులో బెంగాళీ బ్రాహ్మణ కాయస్థ కుటుంబాల్లో బహు భార్యాత్వం ఎక్కువ. తగిన వరులు దొరుకక కన్యాదాన ఫలం ఎలాగోలాగు దక్కించుకోవాలని వృద్ధులకయినా, వివాహితులకయినా తమ కూతుళ్ళనిచ్చి పెళ్ళిళ్ళు చేసేవారు తల్లి దండ్రులు.

ఒక్కొక్కరికి అయిదారుగురు ఇంకా పదిమందికి పైగా భార్యలుండే వారు. ధనాశకు అన్ని కల్యాణాలు చేసుకున్నా తమ జీవితంలో ఏ నాలుగైదు

సార్లో ఆ భార్యల ముఖాలు చూసేవారు. కొందరు తాళికట్టుకొన్ననాటినుండి తండ్రి ఇంట్లోనే పడివుంటూ పనులుచేస్తూ కష్టంగా జీవించేవారు. ఆ పతిదేవునితో ఏ ప్రయోజనమూ లేకున్నా ఆయనగారు మరణిస్తే మాత్రం వైధవ్యం ప్రాప్తించేది

విధవలకు మళ్ళీ పెళ్ళాడే అర్హతలేదు. పురుషులు ఎందరినయినా పెళ్ళాడవచ్చు. స్వర్గానికి వెళ్ళినా వాళ్ళ సరదాలు పలురకాలు-సిగ్గుమాలిన పనులు కూడా!

మరి స్త్రీలు? యువతులయినా విశంతువులయితే బ్రహ్మచర్యంతో, కఠోర నియమాల్లో కాలం గడపాల్సిందే.

వయసు కారణంగా కొందరు తప్పటడుగులు వేయటం సహజం. ఐతే వారిని ఆకర్షించేది, మోసగించేది మగమహారాజులే. వారికి లేని పాపం ఈ నారులకే చుట్టుకునేది.

## పాతివ్రత్యం

స్త్రీలకు పాతివ్రత్యం మహా విలువైన భూషణం అన్నారు మన శాస్త్రకారులు. దానికి అనసూయ, అరుంధతి, సీత, సుమతి కథలవలె మహిమలనూ అంటగట్టారు.

సీతా మహాసాధ్విని శీల పరీక్షకోసం అగ్ని ప్రవేశం చేయించాడు శ్రీరాముడు రావణ వధ అనంతరం. అది ఆటవిక న్యాయం.

పురుషులకు శీల పరీక్ష లేదు.

స్త్రీలు అపకీర్తి తెచ్చేవారుగా వుండడంకంటె భర్తతోపాటుగా మరణించడమే బాగని భావించి వుంటారు నాటివాళ్ళు. స్వార్థంముందు హితం మరుగున పడిపోయింది. అందుకే అనేకమంది యువతులు చితిమంటలపాలు కావల్సివచ్చింది. అదో ఆచారమయింది. పుణ్యకార్యమయింది. ఘోరకార్యమయినా కసాయివాళ్ళు గొర్రెపిల్లల గొంతులు కోయడానికి అలవాటు పడ్డట్లే జాలి మరచినట్లే మన పురుష పుంగవులు ఈ దురంతానికి అలవాటు పడిపోయారు. సతికి పాల్పడని స్త్రీల శీలాన్ని శంకించారు. మగవాళ్లు ఆడవాళ్ళనెప్పుడూ చిన్నచూపు చూసారు. కొన్ని ఆటవిక జాతుల్లోవలెనే ముస్లిం స్త్రీలకూ పురుషులతోపాటు పూజామందిరాలకు వెళ్ళే వీలులేదు.

అరబ్బు దేశాల్లో (ఈజిప్టులోని) ఒక యువతి సోదరుని మిత్రుని మాటలకు నవ్వినందుకు ఆమెను, సోదరుడు తండ్రి రాళ్ళతో కొట్టి చంపిన వార్త పేపర్లకెక్కింది. ఒక స్త్రీని రాళ్ళతో పురుషులు కొట్టి చంపే ధర్మాన్ని జాలితో ఆపుచేసి క్రీస్తు వారిని మందలించి పంపడం బైబిల్‌లో వుంది.

భారతదేశపు మొదటి మాటల చలన చిత్రమయిన "ఆలం ఆరా"లో నాయికను అనుమానంవల్ల ముస్లిం ప్రజలు రాళ్ళతో కొట్టడం వుంది.

జనం తలచిందే ఆచారమయింది. పూర్వంలో వ్రాసిందే వేదమైంది. అది ఏ శాస్త్రాల్లో లేకున్నా జనాచారాలకు ఆమోద ముద్రలు పడుతుంటాయి.

శ్లో॥ నయత్ర సాక్షాద్విధయో న నిషేధాః శృతౌ స్మృతౌ
దేశాచార కులాచారైః స్తత్ర ధర్మో నిరూప్యతే॥

అని స్కంధ పురాణ సూక్తి అంటే-ఎక్కడ ఏ విధులనయితే వేదాలు స్మృతులు నిషేధిస్తాయో, వాటిని దేశాచార కులాచారాలుగా అంగీకరించాలి. అదీ సంగతి।

మనుస్మృతిలోనూ పై భావాన్ని పోలిన శ్లోకం వుంది.

సతి అలాగే ఒక ఆచారమయింది.

## రాయ్ సతీ సహగమనం చూశాడు

దీనికి యెంతగానో కలతచెందాడు రాంమోహన్‌రాయ్. తన బాల్యం నుంచీ తమ గ్రామంలో చుట్టుప్రక్కల ఊళ్ళలో యెందరో తరుణులు చితులపై కాల్చబడడం కళ్ళారా చూసాడు.

ప్రముఖ రచయిత ముద్దసాని రాంరెడ్డి (ఊటూరు)గారినుండి నా కుమారుడు హర్షవర్ధన్ సేకరించి పంపిన ఈ విషయం చూడండి.

“రామ్మోహన్‌రాయ్ వదిన సహగమనం చేసింది. రాయ్ పద్దెనిమిదో ఏట ఈ సంఘటన జరిగింది. ఇతని అన్న వివాహమయిన కొద్దికాలానికే మరణించాడు. అప్పుడాతని భార్య వయస్సు ఇరవై సంవత్సరాలు. ఆవిడకు పతితో సతీ సహగమనం చేయలనే ఇష్టం లేకున్నా ఆయన కుటుంబీకుల ప్రోద్బలంతో ఈ చర్య నెరవేర్చబడింది. చితి దగ్గరికి ఆమెను బాజా భజంత్రీలతో తీసుకువెళ్ళారు. మంటలు చెలరేగుతున్న చితిపైకి పెద్ద పెద్ద కర్రలతో పదుగురు వ్యక్తులు ఆ యువతిని త్రోయటము, ఆమె బిగ్గరగా అరుస్తూ వెనక్కి పరుగెత్తి రావటము,



వాళ్ళు తిరిగి నిర్దాక్షిణ్యంగా అగ్నిలోకి నెట్టడము మొదలయిన దారుణ దృశ్యాలన్నీ రాంమోహన్ లేత హృదయంపై గాఢమయిన ప్రభావం కల్గించినవి.

చిన్న తనాన తన కన్నులార తిలకించడంవల్ల ఈ దురాచారం హిందూ మతానికి మాయని మచ్చ అని దాన్ని రూపుమాపాలని రాయ్‌కు స్థిర సంకల్పం కలిగింది.

ఇదే విషయం ఇంకా ఇతర వివరాలతో ఒకటి అక్టోబర్ 1987 రాత్రి హైద్రాబాద్ టి.వి. తెలుగు ప్రసారపు మహిళల చర్చలోనూ వుంది.

ఇందులో అతిశయోక్తిలేదు-రాయ్ తన వాదనలో ఇలా వివరించాడు.

## సతీ సహగమనం కాదు - సతుల సజీవ దహనం

స్త్రీని ఆ దినం ఉపవాసముంచుతారు. అలంకరిస్తారు. మంత్ర సంకల్పం జరిపి మేళతాళాలతో భర్త శవం వెంట నడిపించుకు వెళ్తారు. తర్వాత తాళ్ళతోనో ఇనుప గొలుసుతోనో బంధిస్తారు. ఒక ప్రక్క ఉన్నగా నిప్పంటించిన చితిపై పతి శవం చెంత కూర్చోబెట్టి పైన కట్టెలు పేర్చి మంటలు ఎగదోస్తారు. అప్పటికీ ఆమె తప్పించుకుపోకుండా పొడుగాటి వెదురు వాసాలతో ఆమెను నలువైపుల నుండి పెద్దమనుష్యులు అదిమిపెడతారు.

ఆమె ఆక్రందన భక్తజనం స్తోత్రపాఠాల్లో బ్రాహ్మణుల మంత్రాల్లో బాజాల హోరులో కలిసిపోతుంది-శరీరం అగ్నికి ఆహుతి అవుతుంది.

సహగమనం ఉత్తప్రచారం, ఏ ఒక్కరిద్దరో ఆచరిస్తే అది వ్యక్తిగత విషయంకాని దేశవ్యాప్త ఆచారం కాదు, అని కొందరు నాతో వాదించారు.

30 నవంబర్ 1986 'ఉదయం' దినపత్రిక ఆదివారం అనుబంధంలోని విషయం-

వైజయంతి ఇరవైయేళ్ళ యువతి. ఆమె భర్త పేరు బిరన్‌సింగ్ వయస్సు ముప్పయి. మొదటి భార్య ఒక్క కొడుకును కని మరణిస్తే ఈమెను రెండవ భార్యగా పెళ్ళాడాడు. ఈమెకు పిల్లలు లేరు. బీడీలు చేయడం వృత్తిగా జీవించింది. వారు కంగార్ ఠాకూర్ క్షత్రియులు. మామూలు ఆర్థిక పరిస్థితి. 26 నవంబర్ 86నాడు ఉదయం 11 గంటలకు భర్త బిరన్‌సింగ్ మరణించాడు. ఆదే

రోజు సాయంత్రం అయిదుగంటలకు వైజయంతి తన తండ్రికి, బంధువులకు అందరికి చెప్పి, ప్రజల పూజలు, భజనల మధ్య వెళ్ళి భగని కొష్టంచుట్టూ ఏడు మార్లు ప్రదక్షిణలు చేసి చితిలో కూర్చుని అరవకుండా ఆ మంటల్లో కాలి బూడిద అయింది అని వుంది.

కాని, నిజానికి అది బలవంతపు దహనమట!

తర్వాత పోలీసులు రంగంలోకి దిగి ఇది అమానుషమని గ్రామపెద్దలను అరెస్టు చేశారు. శిక్షలు వేయకే వదలి వుండొచ్చు. లేకుంటే సనాతన ధర్మ రక్షకు లయిన మన నాయకులు ఊరుకుంటారా? ప్రజలు ఆమెను దేవతగా భావిస్తున్నారు. ఆమెకు గుడికట్టాలని కొందరు ధనం ధాన్యం వసూలుచేస్తున్నారు!

మధ్యప్రదేశ్, జబల్‌పూర్ జిల్లాలోని ఉమారియా గ్రామంలో జరిగిన సంఘటన ఇది. ఆ! ఏదోలే అనుకుందామంటే—

## సహగమన జ్వాలలు చల్లారలేదు

1887 సెప్టెంబర్ 5 తేదీన మరో సతీసహగమన వార్త దినపత్రికల్లో కనిపించింది. ఆంధ్రప్రభ 11 సెప్టెంబర్ సంచికలో—

"మళ్ళీ ఎగసిన సహగమన జ్వాలలు"

జైపూర్-సెప్టెంబర్ 10.

ఆ గ్రామంలో మహాశక్తికి జై అనే నినాదాలు రోజు రోజుకు ఉధృత మౌతున్నాయి. ప్రతి ఒక్కడు ఆ సతి సంస్కృతిలో లీనమైనట్లే కనిపిస్తున్నారు.

చట్ట విరుద్ధమైన ఆచారంలో పాల్గొన్నామన్న భయమే వారికి లేదు." క్లుప్తంగా విషయం ఇది -

రాజస్థాన్ శికార్ జిల్లాలోని దియోరాలా గ్రామంలో రూప్‌కన్వర్ అనే పద్దెనిమిదేండ్ల యువతి భర్త మాన్‌సింగ్ అతిసార వ్యాధితో మరణించగా అదే రోజు 4 సెప్టెంబర్‌న పతి శిరాన్ని ఒడిలో పెట్టుకొని మరో చేత కొబ్బరికాయ పట్టుకొని, మరది చితికి నిప్పంటించగా అగ్నిమంటలకు ఆహుతయింది. బీహార్‌లోని రాంచి ఆమె జన్మస్థలం. తండ్రి బాల్‌సింగ్ రథోర్ జైపూర్‌లో రవాణా వ్యాపారి. సెకండరీ స్థాయివరకు చదువుకుంది. భర్త మాన్‌సింగ్ ఎం.ఎ.బి ఇడి. మామ సుమేర్‌సింగ్ స్థానిక పాఠశాల ఉపాధ్యాయుడు. ఆయన తనకి విషయం తెలియదన్నాడు. తండ్రి తన కూతురు రెండు వంశాలకు కీర్తి తెచ్చిందన్నాడు.

మంటలు భుజాల వరకు ఎగియగానే 'దేవీ నీ దర్శన భాగ్యం ప్రసాదించు' అని మూఢభక్తులు అరవగానే ఆమె మేలి ముసుగు తొలగించి చూసిందట. నిజానికి ఆమెను బలవంతంగా చితిలో త్రోసారని తర్వాతి పేపర్ల వార్త.

పోయిన ఫిబ్రవరిలో రూప పెళ్ళయింది. మొదట పది చివర పది అంతా ఇరవై రోజులే ఈ ఎనిమిది మాసాల్లో అత్తగారింట ఆమె గడిపింది. మాన్‌సింగ్ అనారోగ్యపరుడు. అతనిపై ఆమెకు అంతగా ప్రేమ-స్నేహంలేదు. ఇలా భర్త చితిపై ఆ సతిని బలవంతంగా కాల్చి వారి దాంపత్య బంధాన్ని ఆదర్శం చేశారు. ఇప్పుడామెను దేవతగా కీర్తిస్తున్నారు.

## సనాతన ధర్మ రక్షకులు

ఆమె చితి ఆరక పదమూడురోజులు కాలింది. కత్తులుపట్టి రాజపుత్ర

వీరయువకులు రేయింబవళ్ళు వంతుల వారీగా కాపలా కాశారు 13వ, రోజు సతీ చున్రి ఉత్సవాన్ని ప్రకటించారు.

కోర్టు ఆదేశం ప్రకారం ప్రభుత్వం ఆ ఉత్సవాన్ని నిషేధించినా రవాణా సౌకర్యాలను రద్దుచేసినా ఆ దినం 3,4 లక్షలమంది ఆ ఉత్సవంలో పాల్గొన్నారు. సతీ పూజలు జరిపారు. పోలీసులు కన్పించలేదు కాని రాజకీయ నాయకులు కన్పించారు.

రూప సోదరులు తెచ్చిన చున్రి (పట్టుచీర) చితిలో కాల్చారట బాల్ సింగ్ వెయ్యినొక్క బ్రాహ్మణులకు విందుభోజనం పెట్టి దక్షిణలిచ్చాడు. సుమేర్ సింగ్ ఉత్సవానికి వచ్చిన మహిళలను ఆశీర్వదించాడు, తన కోడలివలె కండని కాబోలు! పిచ్చి పంతులు. బెంగాళ్‌లో ఉధృతంగా అంటే, ఈ దేశంలోని సహగమనాల్లో 57 శాతం వున్నా ప్రభుత్వ కఠిన నిబంధనలవల్ల అక్కడ పూర్తిగా అంతరించి పోయింది ఇతర ప్రాంతాల్లో మాత్రం ముఖ్యంగా క్షత్రియల్లో ఈ దురాచారం అంతరించలేదు. బ్రాహ్మలు తమ కుటుంబాల్లో సతిని ఆచరించటం మానేసిన ఇతరులను ప్రోత్సహిస్తూనే వున్నారు. వారికేం సంభావనలు ఘనంగా చేతబడుతుంటాయయ్యే.

రూపకు ముందు ఆ దియారాలాలోనే ముగ్గురు సతికి బలిపెట్టబడ్డారట.

## వితంతువుల దహన వివరాలు

ఇంకా ఆ పరిసర ప్రాంతాల్లో సతికి చితుల పాలైనవారు –

1979 ఉత్తరప్రదేశ్ ప్రాంపాల్లో బాందాజిల్లా జారీ గ్రామంలో 'జావిత్రి' అనే యువతి పతి చితిలో పడింది.

1980 ఆగస్టు 30న, షద్లీ గ్రామంలో ఓం కన్వార్ అనే సతి పెళ్ళయిన యేడాదిలోగానే 'సహగమనం'కు పాల్గొని అగ్ని మంటల్లో కాలి పోయింది. ఆమెకు ఆలయం కట్టారు, పూజలు చేస్తున్నారు -

1938 జూలై 25, బాందాజిల్లా సంగారాలో గాయిత్రీదేవి భర్తచితి మంటల్లో కాలిపోతుండగా ఫోటోలు తీసి అమ్మారు. లక్షలు వెచ్చించి గుడి కట్టారు.

1986 మధ్యప్రదేశ్, జబల్‌పూర్ జిల్లాలో వైజయంతి బలి.పోలీసుల జోక్యం వల్ల రక్షింపబడినవారు-

1981 అట్లారా పోలీస్ స్టేషన్ గ్రామంలో కుసుమను.

1983 రాజకోటీ, ఇద్ లో గోకుల్ బాయిని.

1985 మార్చి 12 జైపూర్-దేవీపురాలో జస్వంత్ కన్వీర్‌ను-

1987 ఏప్రిల్ 25 పాలిజిల్లా బాగ్దిలో 10-20 వేలమంది జయచేరి సతికి బలి చేసేవేళ భన్వారీని-పోలీసులు అతికష్టంమీద ఆపగలిగారు.

అదీ ఇప్పటి పరిస్థితి. వందయేండ్లకు పూర్వం మరీ ఘోరంగా వుండేది

బెంగాళీలో సతి సహగమనాల లెక్క—

1785లో 375 వితంతువులు ఇలా బలిచెయ్యబడితే

1810 నాటికి 839కి ఆ సంఖ్య పెరిగింది.

1912లో గవర్నర్ జనరల్ వెల్లీ దీన్ని నిషేధింపజూశాడు. అయినా

ధన నష్టం సంప్రాప్తమయ్యేవి. అయితే సంఘానికి వెరచి ఈ దురాచారానికి తమ కూతుళ్ళను బలిచేసేవారు. ఎంత ఘోరం! ఏమిటీ సమాజం.

బుద్ధ దేవుని భూమిలో పుట్టినావు
సహజమగు ప్రేమ నీలోన చచ్చెనేమి?
అందమును హత్యజేసెడి హంతకుండ
మైలపడిపోయెనోయి నీ మనుజ జన్మ! -కరుణశ్రీ.

'అష్టవర్షాత్ భవేత్కన్యా' అని అది బాల్య వివాహాల కాలం. ఇప్పటి వలె వైద్య సౌకర్యాలు లేక మరణాలూ ఎక్కువే. ముక్కుపచ్చలారని బాల విధవలు ఎందరు చితులపాలయ్యారో. ఇప్పుడు కూడా పెద్దమొత్తంలో రాజస్థాన్‌లో సతీనిషేధానికి వ్యతిరేక ప్రదర్శనలు చేస్తున్న వార్తలు ఫోటోలు చూస్తున్నాం. అదంతా పురుషుల ఒత్తిడికి లోనైనవారి దయనీయ పరిస్థితికి నిదర్శనం మాత్రమే. ఈనాడు రూప్‌కన్వార్ మృతి కారణంగా సతీవిధానాన్ని వ్యతిరేకించి ప్రదర్శనలు జరిపినవారిని, ప్రసంగించినవారిని రాజస్థాన్ "ధర్మ రక్షా సమితి" యువకులు బెదిరించినట్లే, నాడు సహగమన దుష్కర్మను నిరసించిన రాయ్‌ను కూడా "ధర్మసభ" ఛాందసులు నిందించారు. తమ బంధు స్త్రీని చంపుకోవద్దంటే హితం తెలుసుకోలేని కుమతులు! వారి కోపతాపాలను లెక్కచేయలేదు రాయ్.

## రాయ్ సతీ విధానాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు

మానవతా దృక్పథంతో ఆడకూతుళ్ళ ప్రాణాలను అగ్ని మంటలపాలు కాకుండా రక్షించాలనుకున్నాడు. అందుకు తీవ్రంగా శ్రమించాడు.

1818లో సతికి వ్యతిరేకంగా రాయ్ మొదటి రచన వెలువడింది. 1820లో రెండవ రచన బెంగాళీలో రచించి ఆంగ్లంలోకి మార్చి రెండు భాషల్లో ప్రచురించాడు. దీన్ని లేడీ వార్న్ హేస్టింగ్స్‌కు అంకితమిచ్చాడు. 1830లో మరో సుదీర్ఘ చర్చా రచన చేశాడు.

1828లో ఇండియా గవర్నర్ జనరల్‌గా వచ్చిన లార్డ్ విలియం బెంటింగ్‌కు విషయం తెలిపాడు. ఈ దురాచారాన్ని ఖండిస్తూ 800 మంది ప్రజల ప్రముఖుల సంతకాలను 120 మంది పండితుల అభిప్రాయాలను తన పిటిషన్‌కు బలంగా సేకరించి పంపాడు. పార్లమెంట్ ఆమోదంతో బెంటింగ్ 4 డిసెంబర్ 1929న సతీ ఆచరణను రద్దుపరిచాడు. దాన్ని కాదని మెసిలేవారు శిక్షార్హులు.

ఛాదస్త పండితులు అంతటితో ఊరుకోక రాయ్ ఏదో పాపకార్యం చేస్తూ హిందూ మతాన్ని, సంస్కృతిని భంగపరుస్తున్నట్లుగా భావించి లండన్ కౌన్సిల్‌కు, డైరెక్టర్ బోర్డుకు ఫిర్యాదులు చేశారు. రాయ్ సమాధానాన్ని విని వారు అవి కొట్టివేశారు. 1832లో, సహగమన దుష్ట సంప్రదాయాన్ని రద్దుచేసిన ఆ శుభవార్త వినడానికి రామ్మోహన్‌రాయ్ స్వయంగా హాజరయ్యాడు.

వితంతువుల ప్రాణాలను ఆచారంపేర అగ్నికి బలికాకుండా నిలిపిన మహనీయుడు రాయ్. అలాంటి దీనురాండ్రకు తిరిగి వివాహాలు చేసుకోవడానికి శ్రమించి హక్కు సాధించినవారు ఈశ్వరచంద్ర విద్యాసాగర్-కందుకూరి వీరేశ లింగం పంతులు. వారల చరిత్ర ఆదర్శప్రాయం.

# లండన్ ప్రయాణం

నవంబర్ 15,1830 నాడు రాజారామ్మోహన్‌రాయ్ ఇంగ్లాండుకు పయన మైనాడు. బంధుమిత్రులు ఆ మహాపురుషునికి ప్రేమపూర్వకంగా వీడ్కోలు చెప్పారు. కాని, ఆదే తుది వీడ్కోలు అవుతుందని వారికేం తెల్సు! అప్పటికి విమానం, రైలు, కారు కాదుకదా, సైకిలయినా తయారుకాని కాలం. గుర్రాలు, బండ్లు, ఓడలే ప్రయాణ వాహనాలు. కాదంటే కాలినడక ఎప్పుడూ వుండే.



8 ఏప్రిల్ 31న ఓడ బ్రిటన్‌కు చేరుకుంది.

లివర్‌పూర్‌కు ఆయన చేరుకోగానే "వేదాంత సంగ్రహం" ఆంగ్ల పుస్తకంద్వారా 1816లో అభిమానులయిన పురప్రముఖులు ఆయనను చూడవచ్చారు వారి ఆదరానికి రాయ్ కృతజ్ఞతలు చెప్పాడు.

విలియం రాస్కో అనే చరిత్రకారుడు అశక్తుడై పక్షవాతంతో మంచాన పడి వున్నప్పటికీ తన కొడుకును పంపి రాయ్‌ను పిలిపించుకొని మితంగానయినా ప్రశంసిస్తూ మాట్లాడి అమిత ఆనందం చెందాడు.

లివర్‌పూర్‌నుంచి లండన్ చేరుకున్నాడు. అక్కడ ప్రముఖ తత్త్వవేత్త జెమిలీబెంతాంవచ్చి రాయ్‌ను కల్సి అభిమానంతో మాట్లాడాడు.

లండన్ చేరటానికి ముఖ్యంగా మూడుకారణాలున్నాయి. ఒకటి ఆ కాలపు ఢిల్లీ మొగల్‌పాదుషా రెండవ అక్బర్ వార్షిక వేతనం పెంచే విషయంలో ఇంగ్లాండ్ రాజుకు విజ్ఞాపన పత్రం ఇవ్వటం. రాయ్ ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లకు ఇతర ప్రముఖులకుకూడా ఆ పత్రాన్ని అందజేశాడు. అన్నికాకున్నా అందులోని కొన్ని అంశాలనయినా అంగీకరించి 1833 ఫిబ్రవరిలో పాదుషా భరణం మూడు లక్షలకు పెంచబడింది.

రెండు-సతీసహగమన దురాచార నిషేధానికి ప్రభుత్వ చట్టం అమలు పరచడం గురించి ప్రయత్నం. 1828లో ఇండియా గవర్నర్ జనరల్‌గా వచ్చిన లార్డ్ విలియం బెంటింగ్ సతీ నిషేధ చట్టం అమలుపరిచాడు. 1932 జూన్‌వ లండన్ కౌన్సిల్ ఆమోదించింది.

మూడు-హవుజ్ ఆఫ్ కామన్స్‌లో కంపెనీ శాసన పునరంగీకార చర్చ సందర్భంలో హాజరుకావటం.

## లండన్‌లోని విశేషాలు

అక్కడి ప్రముఖులతో విశేషంగా రాజకీయ చర్చలు కావించాడు రాయ్ ఇంగ్లాండు రాజు సోదరుడు కంబర్‌లాండ్,రాయ్‌ను హవుజాఫ్ లార్డ్స్‌కు పరిచయం చేశాడు,

లార్డ్స్ బ్రవంతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఆయన బానిసత్వ నిర్మూలననూ, ప్రజా విద్యా విధానాన్ని ప్రోత్సహించిన వ్యక్తి ఆయన ఉదాత్తత రాయ్‌కు నచ్చింది.

1831 జూలై 6నాడు ఈస్టిండియా కంపెనీవారి విందారగించాడు. ఆ కంపెనీ అధ్యక్షుని శుభాకాంక్షలు పొందాడు.

నాలుగవ విలియం రాజు పట్టాభిషేక ఉత్సవాన్ని తనకు ప్రత్యేకంగా ఐరోపారాజుల రాయబారుల వరుసలో ఏర్పాటుచేయబడిన ఆసనంలో కూర్చొని తిలకించే గౌరవం పొందాడు.

రాయల్ ఆసియాటిక్ సొసైటీవారి వార్షిక సమావేశానికి ఆహ్వానితుడై వెళ్ళి పాల్గొన్నాడు. ప్యారిస్‌లోని ఏసియాటిక్ సొసైటీకి రాయ్ 1824లోనే సభ్యుడుగా ఎన్నుకోబడినాడు.

హెన్రీ థామస్ కోల్‌బ్రూక్, హ్యూమనిస్టు సోషలిస్టు అయిన రాబర్టు ఓవన్‌లను కల్సుకొని మాట్లాడాడు.

విశ్రాంతిలేదు. సమయ దుర్వినియోగంలేదు. అలసట ఎరుగని పోరాటం రాయ్‌ది. జగతి సుపకర్తలకు ఇది సహజగుణము.

## సంస్కరణ బిల్లు ఆమోదం

1831 మార్చిలో మొదటి సంస్కరణ బిల్లు బ్రిటిష్ పార్లమెంట్‌లో ఓడిపోయింది. ఆ బిల్లుతో దేశం సంచలనం పొందుతున్న దశ. దాని ఓటమితో పార్లమెంట్ రద్దయింది.

క్రొత్తగా అధికారంలోకి వచ్చిన హౌవుజాఫ్ కామన్స్ రెండవ సంస్కరణ బిల్లును 1831 సెప్టెంబర్‌లో ఆమోదించింది. దాన్ని ప్రభువుల సభ త్రోసి పుచ్చింది. 1932 మార్చిలో మూడవసారి ప్రజల ఒత్తిడికి దాన్ని అంగీకరించాయి ఉభయసభలూ. జూన్‌లో ఆమోదముద్ర పడింది.

ఐర్లండు, స్కాట్లండు అదే విధానాన్ని అనుసరించాయి. ఈ నూతన మార్పునకు రాయ్ ఎంతగానో సంతసించి ఇండియాలోని మిత్రుడు రాత్‌బోన్‌కు ఉత్తరం వ్రాసాడు.

"తీవ్రమయిన వ్యతిరేకత వున్నా, ప్రభువులకు రాజకీయ పరిజ్ఞానం చాలినంతగా లేకున్నాకూడా, సంస్కరణ బిల్లు సంపూర్ణ విజయం సాధించడం నాకు సంతోషాన్ని కలిగించింది. ఇక దేశం, తమ స్వలాభంకోసం దోపిడీచేసే కొందరికి బలికానక్కరలేదు. అలా ప్రజల వినాశనం కొనసాగ వీలులేదు. దాదాపు యాభై ఏండ్లనుంచి సాగుతున్న అక్రమం ఇక సాగవీలుండదు. సంస్కరణ బిల్లు విఫలమై వుంటే నేను బహిరంగంగా చెప్పుతున్నట్లుగానే, ఈ దేశంతో సంబంధాలన్నీ తెంచు

కొని వుండేవాడిని. ఇప్పుడు నేను మీతోపాటు ఈ దేశ పౌరుడుగా వుండడానికి గర్విస్తున్నాను. ఇప్పుడు ఈ దేశ విముక్తిని ఆ మాటకువస్తే ఈ ప్రపంచవిముక్తిని చూసే అవకాశం లభించినందుకు నేను మనసారా ఆనందిస్తున్నాను"

## ఫ్రాన్సు రాజును కలిశాడు

1832 అక్టోబర్ 14నాడు రాయ్ ఫ్రాన్సు రాజును కలిశాడు. డిసెంబర్‌లో రాయ్ రచనలను, భావాలను గురించిన సమీక్షతో మంచి వ్యాసం ఫ్రాన్స్ పత్రికల్లో ప్రచురించబడింది.

1818లోనే రాయ్ రచనలు ఫ్రాన్స్ చేరాయి. వాటిని బిషప్ గ్రాయిన్ అబ్బెగ్రెగాయిల్‌లకు కలకత్తా టైమ్స్ డి. అకోస్టా పంపాడు. గ్రెగాయిల్ ఫ్రాన్స్‌లో రాయ్ పేరును వ్యాప్తిచేశాడు. అలా రాయ్‌కు ఏశియాటిక్ సొసైటీ సహా సంచాలక బిరుదు లభించింది.

1824లో రాయ్ ఫ్రాన్స్‌ను ఎంతో అభిమానించేవాడు. కళలను విజ్ఞాన శాస్త్రాలను పెంపొందించిన దేశంగా, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం, సమానత్వం అనే మూడు ప్రముఖ అంశాలకోసం పోరాడి సాధించిన దేశంగా ఫ్రాన్సును మెచ్చుకున్నాడు.

పాస్‌పోర్టుకోసం 31 డిసెంబర్ 1826న ఫ్రెంచి విదేశాంగ మంత్రికి లేఖ వ్రాస్తూ, చీనాలో తప్ప మరే ఆశియా దేశంలోనూ లేని ఈ పాస్‌పోర్టు విధానాన్ని రద్దుచేయాలని కోరాడు.

విశ్వం మనందరిది. నచ్చినచోటికి నిరాటంకంగా వెళ్ళగలగాలి. ప్రవేశ అనుమతి పత్రాల అడ్డంకి అనవసరమని రాయ్ భావం. రామ్మోహన్ భావాలు అంతటి సంచలనాత్మకమైనవి, విశాలమయినవి.

## 'రాజా' రాయ్

రామ్మోహన్‌రాయ్‌కు "రాజా" బిరుదు ఢిల్లీ చక్రవర్తి ఇచ్చినట్టిది. బ్రిటిష్ ప్రభుత్వం రామ్మోహన్‌ను ఢిల్లీ చక్రవర్తి ప్రతినిధిగా గుర్తించింది. "రాజా" బిరుదును ఆమోదించింది.

1831 సెప్టెంబర్ 7వ తేదీన సేంట్ జేమ్స్ ప్యాలెస్ రాజ్యసభలో విలియంరాజు, రాజారామ్మోహన్‌ను కల్సుకొని మాట్లాడాడు. విందుకు ఆహ్వానించాడు. అలా లండన్‌లోని ఉన్నత వర్గాలవారు రామ్మోహన్‌ను తమ మిత్రునిగా గౌరవించి ఎన్నో సభలు ఏర్పరిచారు.

ఇలా విదేశాల్లో వివేకానందునికి ముందుగానే మార్గం సుగమం చేసాడు రామ్మోహన్.

## సన్మాన సభ

బ్రిటిష్ ఏకేశ్వరో పాసకుల సంఘం రాయ్ గౌరవార్థం సభ జరిపింది. జె. బెంథాం జీవితచరిత్ర వ్రాసిన డాక్టర్ బౌరింగ్ రామ్మోహన్‌కు స్వాగతం చెప్పుతూ అన్నాడిలా.



"ఆయన ఇక్కడికి రావటంవల్ల మా హృదయాల్లోని ఆసక్తి, నిరీక్షణ లకు కలిగిన ఆనందాన్ని మాటల్లో చెప్పలేం. తమ కీర్తిద్వారా తమ తర్వాతకూడా జీవిస్తున్న మహాపురుషులు తిరిగి తమ మధ్య ప్రత్యక్షమయితే ఎలా వుంటుందో అని కొందరు రచయితలు తమను ప్రశ్నించుకున్నారు. అలా ప్లేటో, సోక్రటీస్, మిల్టన్, న్యూటన్...తమ ముందు కనిపిస్తే ఎలా వుంటుందో అనుకున్నారు. రాజారామ్మోహన్ పేరుచెప్పి మీరు స్వాగతం పలకవలసి వచ్చినప్పుడు నేనుకూడా ఆ రచయితలు పొందిన అనుభూతినే పొందాను, వేలకొలది సంవత్సరాలకు పూర్వం

జీవించిన ఆ మహాపురుషునిపట్ల చూపే ఆసక్తినే వేలమైళ్ళ దూరంనుంచి వచ్చిన మీకు చూపవల్సి వుంది"

అమెరికా హార్వర్డు విశ్వవిద్యాలయ మాజీ అధ్యక్షుడు డాక్టర్ కిర్క్‌లాండ్ "అమెరికావాళ్ళు రాజారామ్మోహన్ రాక కోసం ఎంతో ఆత్రంగా ఎదురు చూస్తున్నారు" అని తెలిపాడు. రెవరెండ్ డబ్ల్యు. జె. ఫాక్స్ తదితరులు ప్రశంసించారు.

అప్పటి రాయ్ కృతజ్ఞతా వాక్కులు చిరస్మరణీయాలు.

"వివేకానికీ-శాస్త్రానికీ, లౌకిక పరిజ్ఞాన సంపదకూ-అధికార పక్ష పాత ధోరణికీ మధ్య పోరాటం సాగుతున్నది అయితే మీ విజయం ఎప్పుడో ఒకప్పుడు తప్పక సాధ్యం కాగలదని నేను విశ్వసిస్తున్నాను...నాకు మీరు చేసిన ఈ సన్మానాన్ని నేను నా జీవితంలోని తుది క్షణందాకా మరచిపోలేను"

## అంతిమ యాత్ర

అంతులేని సమస్యల పోరాటం రామమోహన్‌ను ఆయాసంపాలు చేసింది. కలకత్తాలోని తన మెకింతోష్ అండ్ కంపెనీవారి బాంకింక్ హావుజ్, లండన్‌లోని మెకింతోష్ అండ్ కంపెనీలు విఫలం కావడంతో ఆ విచారం రామ్మోహన్ వృజదేహాన్ని దెబ్బతీసింది.

మిత్రుల బలవంతంతో విశ్రాంతికోసం బ్రిస్టల్ వెళ్ళాడు. లూయిస్



మీడ్ చాపెల్ బోధకుడయిన డాక్టర్ లంట్ కార్పెంటర్ శిష్యురాలయిన మిస్ కాసిల్ ఇంట వున్నాడు. మిస్ హేర్ ఆయనకు శ్రద్ధగా పరిచర్యలు చేసింది.

ఎందరో ప్రముఖ వైద్యులతోపాటు డాక్టర్ ఎస్టిలిన్ ఆయనకు చికిత్స జరిపాడు. చివరికి 27 సెప్టెంబర్ 1833 రాత్రి "ఓం"కార నాదంతో ఆయన అంతిమ శ్వాస వదిలాడు.

రాజు మరణించె ఒక చుక్క రాలిపోయె
కవియు మరణించె ఒక తార గగనమెక్కె

రాజు జీవించె రాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకల యందు-విశ్వనాథ.

28 తేదీ పగలు స్టేపుల్ టన్ గ్రోవ్‌లో ఆయన శరీరాన్ని పూడ్చిపెట్టారు అతి సన్నిహితులయిన మిత్ర పరివారం,రామ్మోహన్ పెంపుడు కొడుకు రాజారాం మరికొందరు అభిమానులు ఆయనవెంట వెళ్ళారు.

తర్వాత రాయ్ మిత్రుడు శిష్యుడు అయిన ద్వారకానాధ్ ఠాకూర్ ఇంగ్లాండుకు వెళ్ళి, ఆ శవపేటికను స్టేపుల్‌టన్ గ్రోవ్ నుంచి తరలించి బ్రిస్టల్ నగర సమీపంలోని ఆర్నోస్‌వేల్ శ్మశానవాటికలో 1843 మే 29నాడు ఖననం చేశారు. 1844లో భారత వాస్తురీతిలో అక్కడ ఒక అందమయిన కట్టడం నిర్మించారు.

## రాయ్ స్మృతిలో ఒక్కక్షణం

ఎందరో గొప్పవాళ్ళు సాధించలేని మహత్తర, బృహత్తర కార్యాలను ఒక సామాన్యుడయిన రామ్మోహన్ సాధించి నిజంగానే "రాజా" అయినాడు. అందుకు కారణం ఆయన సదాశయం-దానికోసం వెనుదీయని పోరాటం.

అబ్బె గ్రెగాయిల్ మాటల్లో-"తన రచనలపట్ల చెలరేగే వ్యతిరేకతలను ఎదుర్కోవడంలో ఆయన చూపే హితమితమయిన ధోరణి,ఆయన వాదాలలోని వాడి

కులం, మతం, భాష, సంస్కృతి ఇవేవీ ఆయన విశాల మానవతా
అడ్డురాలేదు. ఆతడు పాశ్చాత్యరూపంలో కనిపించే హిందూ ఆత్మ.
ాత్మక విప్లవ చైతన్యమూర్తి. రాంమ్మోహన్ "రాజా" కీర్తి
పరం।

కులములోన నొకడు గుణవంతు డుండెనా
కులము వెలయు వాని గుణము వలన
వెలయు వనములోన మలయజంబున్నట్లు
విశ్వదాభిరామ వినురవేమ।

(ఈ పుస్తక రచన కోసం సాహిత్య అకాడెమీ ఢిల్లీవారి సౌమ్యేంద్ర
ెలుగు అనువాద పుస్తకాన్ని సంపాదించిన నా పుత్రుడు హర్షవర్ధన్‌కు,
ారి జీవిత చరిత్రలోని రాయ్ అంశాలను పంపిన మిత్రులు ముద్దసాని
గారికీ, అడిగినంతటినే కలకత్తానుంచి ఆంగ్ల బెంగాళీ పుస్తకాలు పంపిన
మిత్రులు ఎ.ఎస్.ఎన్.రావుగారికీ, ఇందులోని శాస్త్ర చర్చలు ఆదరంతో
భిప్రాయాలు తెలిపిన శతావధాని ఎస్. కృష్ణమాచార్యగారికీ ఇంకా సహ
వార్తలు విశేషంగా ప్రచురించిన దినపత్రికలవారికి నా కృతజ్ఞతలు-)

—రచయిత.

